


ఓ రహస్యమయమైన దట్టమైన మంచు అణు రియాక్టర్ వైపుకు కదులుతుంటుంది. డా. మీన్ మీద అనుమానమొచ్చి అత్యున్నత జాగ్రత్తను ప్రకటిస్తారు.




పిల్లలు సైటుకి చేరుకుంటారు, వారికి ఝుంకారం లాంటి ధ్వని వినిపిస్తుంది.




పిల్లల దగ్గర పాపిన్స్ ఉన్నాయి



పిల్లలు ఆ మంచులోకి చేరుకుంటారు, వారిని సూక్ష్మమైన తేనెటీగలలాంటి పురుగులు చుట్టుకుంటాయి




పైకి చూడగానే వారికి, వాటన్నింటికి నాయకత్వం వహిస్తున్న కాస్తంత పెద్ద మైక్రోబోట్ కనిపిస్తుంది.













ఈ మధ్యలో డా. మీన్ పరిశోధనశాలలో...



# ఈ సంచికలో...



చందమామ

సంపుటి: 62 సెప్టెంబర్ 2009 సంచిక: 09















# వేడుక సమయం!

"మార్పు ఒక్కటే మార్పులేనిది!" అన్నమాట ప్రస్తుత ప్రపంచంలో అక్షరసత్యంగా కనిపిస్తోంది. చందమామకూ ఇది వర్తిస్తుంది. పత్రికలోనూ, సంస్థలోనూ చోటు చేసుకుంటూన్న పలు మార్పులు మీరు చూస్తూనే ఉన్నారు.

మాజీ రాష్ట్రపతి భారతరత్న డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ జన్మదినమైన సెప్టెంబర్ 5వ తేదీన ఉపాధ్యాయ దినోత్సవం జరుపుకుంటున్నాం. ఈ సందర్భంగా మన భవిష్యత్తుకు దారి చూపిన జ్ఞానజ్యోతులైన ఉపాధ్యాయులను కృతజ్ఞతతో స్మరించుకోవడం ప్రతి ఒక్కరి కర్తవ్యం!

ఇది పండుగల మాసం. నవరాత్రి ఉత్సవాలను దేశవ్యాప్తంగా జరుపుకుంటున్నాం. ముఖ్యంగా గుజరాత్, కర్ణాటక, మహారాష్ట్ర, బెంగాల్, తమిళనాడు, ఆంధ్ర రాష్ట్రాలలో దేవీనవరాత్రులను మరింత భక్తిశ్రద్ధలతో ఘనంగా జరుపుకుంటారు. జగన్మాత దుర్గాదేవి లోకకంటకుడైన మహిషాసురుణ్ణి సంహరించిందని చెప్పబడే విజయదశమితో దసరా ఉత్సవాలు పరిసమాప్తమవుతాయి. శ్రీరాముడు రావణాసురుణ్ణి సంహరించిన రోజు కూడా ఇదేనని చెబుతారు. చెడు మీద మంచి గెలుపుకు ఈ ఉత్సవాలు సంకేతాలు!

ముస్లింలు రంజాన్ ఈద్ ఈ నెలలోనే జరుపుకుంటారు. రోజంతా ఉపవాసముండే రంజాన్ ఇప్పుడే ముగుస్తుంది. నమాజ్‌లు, విందులు, బంధుమిత్రులను కలుసుకోవడం ఈ పండుగ విశేషాలు! పవిత్ర ఖురాన్ బహిర్గతమయింది కూడా ఈ నెలలోనే కావడం మరో విశేషం!

పండుగలు జరుపుకునే విధానంలో, ప్రేమాభిమానాలు వ్యక్తపరచే పద్ధతులలో కాలక్రమేణా ఎన్నో మార్పులు చోటు చేసుకున్నాయి. కాని పండుగల గురించిన మన మనోభావాలు, ఆనందోత్సాహాలు మాత్రం అసలు మారలేదు. చెక్కుచెదరలేదు. అదే విధంగా చందమామ కూడా తన పాఠకులకు పాత కొత్త ప్రపంచాలను అన్వేషించే అవకాశాన్ని కలిగించే ప్రయత్నాన్ని నిరంతరం కొనసాగిస్తూనే ఉంటుంది.

పత్రికను మెరుగుపరచడానికి, మరింత ఆకర్షణీయంగా తీర్చిదిద్దడానికి నూతన అంశాలను ప్రవేశపెడుతూ పత్రికాభివృద్ధికి ఎప్పటికప్పుడు పాఠకుల అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం. బాలలకు అత్యంత ప్రీతిపాత్రమైన పత్రికగా కొనసాగడానికి పాఠకుల ఆదరాభిమానాలే ప్రధానం అన్నది మరువరాని సత్యం!

సంపాదకుడు : ప్రశాంత్ ములేకర్



సెప్టెంబర్ 2009 Rs. 20/-

*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

*Chairman :* B. Viswanatha Reddi (Viswam)
*Editor & Publisher :* Prashant Mulekar
*Associate Editor :* A.R. Balasubrahmanyam
*Senior Artists:* K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
*Artist :* T. Venkatesan
*Asst. Editor-Copy & Pre-Production :* R. Sudha
*Creative Writer :* R. Vaasugi
*Layout Designer :* K. Narendra Raju

*CIRCULATION TEAM :*
*Mumbai :* Rajendra K Jadhav, *Asst. Manager - Circulation*, Mobile +91 9320565048
CHANDAMAMA INDIA LTD.,
B-3, Lunic Industry, Opp. State Bank of India, Near Police Station Cross Road, No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
*New Delhi :* Sushil Sharma, *Circulation Manager-North,* Mobile +91 99110 91022
CHANDAMAMA INDIA LTD.,
Goyal Business Centre, C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
*Bangalore :* P. Murali, *Asst. Circulation Manager - Karnataka* , Mobile +91 94488 36952
CHANDAMAMA INDIA LTD., 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094.
Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
*Kolkata :* Ananth Prakash, *Circulation Manager-East,* Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com
*Ahmedabad :* Kalpesh Raval, *Sales Officer-Circulation* Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
*Content Head - Online :* Sowmya Bharadwaj
email : online@chandamama.com
*For Marketing Enquiries :*
email : marketing@chandamama.com
*Advertisement :*
email : sales@chandamama.com
*Subscription Queries:* L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
*Customer Cell :* A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
*Production Executive :* Panchakshari R Math
*Head Office :* CHANDAMAMA INDIA LTD., 2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041 Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, 2/513, Sundeep Avenue East, 2nd Main Road, Thiruvanmiyur, Chennai - 600 041. Editor : Prashant Mulekar


# పాఠకుల లేఖలు

చేస్తున్న మార్పులు సంప్రదాయాలకు అనుగుణంగా లేవని భావించే వాళ్ళలో నేనొకణ్ణి. రంగు బొమ్మల్లో ముందున్న సృజనాత్మకత తగ్గిందని అనుకుంటున్నాను. ముఖచిత్రాన్నే ఉదాహరణ కింద తీసుకుంటే ఆ విషయం బోధపడుతుంది.

–వాస్తు రామచంద్ర, రాంజీనగర్, నెల్లూరు–2

**1947**వ సంవత్సరం జూలై నెలలో 'చందమామ' ఆవిర్భవించిన నాటికి నా వయసు 13 సంవత్సరాలు. ఆ వయసు నుంచి ఈ 62 సంవత్సరాలూ, చందమామ పత్రికను విడవకుండా ప్రతీ నెలా కొని చదువుతున్న సీనియర్ పాఠకులలో నేను కూడా ఒకడినని సగర్వంగా చెబుతాను. ఇది చందమామ గొప్పతనం. అయితే, గత కొద్ది నెలలుగా 'చందమామ'లో అభిప్రాయాలనూ, క్విజ్ ప్రశ్నలనూ, సలహాలనూ అడుగుతూ వాటిని ఎస్ఎంఎస్ ద్వారానో, ఇ-మెయిల్ ద్వారానో పంపమని వ్రాస్తున్నారు. ఇవేమీ తెలియని నాలాంటి పాత పాఠకుల సంగతేమిటి? గతంలో చందమామ ముఖచిత్రాలు ఎంతో అందంగా ఉండేవి. వాటిలో మార్పులు తీసుకురావద్దని నా విన్నపం.

–ఎస్. బాలకృష్ణారావు, హైదరాబాదు–35

జూలై సంచిక ముఖచిత్రం చాలా విషాదాన్ని పంచేలా ఉంది. వీలైనంత వరకు కవర్ పాజిటివ్ అప్రోచ్‌తో ఉంచండి. సంతోష సూచకంగా ఉంచండి.

–డా. వివివి రమణ, హైదరాబాదు

## ఎస్ఎంఎస్ ద్వారా

చందమామ మంచి కథల పత్రిక. నూతన లోకాలలో విహరింపజేస్తోంది. –దత్తశర్మ (ఆం.ప్ర.)

మన సంస్కృతీ సంప్రదాయాలను తెలియజేస్తుంది గనుకే, చందమామ అంటే ఇష్టం. –సతీష్ (ఆం.ప్ర.)

కొత్త ఆసక్తికరమైన డిటెక్టివ్ కథలు కావాలి. –కిషోర్ (ఆం.ప్ర.)



మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా, SMS MLANG <space> <Name, Age> <space> <TEL your feedback> 54646 ద్వారా పంపవచ్చు.

# ఉపాధ్యాయ దినోత్సవం

## ఆదర్శ ఉపాధ్యాయుడు!



ఆదర్శ ఉపాధ్యాయుడూ, సుప్రసిద్ధ తత్వవేత్తా, భారత మాజీ రాష్ట్రపతీ అయిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ జన్మదినమైన సెప్టెంబర్ 5వ తేదీన మనదేశంలో ఉపాధ్యాయ దినోత్సవం జరుపుకుంటున్నాం. విద్యార్థుల హృదయాలలో జ్ఞాన జ్యోతులు వెలిగించి జీవితాంతం వెలుగులు ప్రసాదించే మాన్యచరితులు ఉపాధ్యాయులు!

అలాంటి ఆదర్శ ఉపాధ్యాయులలో మున్నెన్నదగిన గొప్ప ఉపాధ్యాయుడైన లూయిస్ బ్రెయిలీని గురించి ఈ సందర్భంగా తెలుసుకుందాం. మూడేళ్ళ వయసులోనే ప్రమాదవశాత్తు బ్రెయిలీ కంటి చూపును కోల్పోయాడు. పదిహేడేళ్ళలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాడు. కొన్నాళ్ళకు ఆయనకు క్షయవ్యాధి సోకడంతో సెలవు తీసుకోమని సలహా ఇచ్చారు. అయితే, తన వృత్తినీ, విద్యార్థులనూ వదిలి ఉండడం ఆయనకు బాధ కలిగించింది. పుస్తకాలు చదవడానికి తను అనుభవించిన తపనను ఆయన మరువలేకపోయాడు. తన విద్యార్థులు ఆ ఆనందాన్ని కోల్పోకూడదని ఆశించాడు. ఆ ఉదాత్త ఆశయంతో రాత్రింబవళ్ళు ఆలోచించి, కృషి చేసి బ్రెయిలీ లిపిని రూపొందించాడు! ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉన్నప్పటికీ, చక్కగా పాఠాలు బోధించేవాడు. నిరాడంబర జీవితం గడుపుతూ, వీలైనంత ఆదా చేస్తూ, ఆ మొత్తంతో విద్యార్థులకు పుస్తకాలు, బ్రెయిలీ రాయడానికి కావలసిన వస్తువులు కొనేవాడు. సాయమడిగే విద్యార్థులను ఆదరంతో ఆదుకునేవాడు. ఆయన మరణానంతరం, ఆయన గదిలో మిత్రులకు ఒక పెట్టె కనిపించింది. దాని మీద ''దీనిని తెరవకుండా కాల్చివేయాలి'' అని రాసి ఉంది. మిత్రులు ఉత్సుకతతో పెట్టెను తెరిచి చూశారు. అందులో బ్రెయిలీ విద్యార్థులకు ఇచ్చినకొన్ని ఋణపత్రాలు కనిపించాయి!

బ్రెయిలీ అంధులకు లిపి కనుగొనడం ద్వారానే కాకుండా, ఆదర్శ ఉపాధ్యాయుడుగానూ చరిత్రలో చిరస్థాయిగా నిలిచి ఉంటాడు. గొప్ప ఉపాధ్యాయుడు తన వద్ద చదివే విద్యార్థులనే కాదు; తరతరాలను ప్రభావితం చేస్తాడు-అని అంటారు. అందుకు ఓ గొప్ప ఉదాహరణ లూయిస్ బ్రెయిలీ! ఆయనలాగే అజ్ఞాతంగా అసంఖ్యాకమైన విద్యార్థులకు వెలుగుదారులు చూపుతూన్న జ్ఞానజ్యోతులకు కృతజ్ఞతాభినందనలు! ఉపాధ్యాయులందరికీ ఉపాధ్యాయ దినోత్సవ శుభాకాంక్షలు!

# కాలంలోకి పయనించండి

ఆన్‌లైన్ చందమామ ఆర్కైవ్స్‌లో బోలెడు ధారావాహికలు, కథలు.

కంచుకోట, భల్లూక మాంత్రికుడు, పాతాళదుర్గం, రాకాసిలోయ వంటి అద్భుత ధారావాహికలు...

పంచతంత్ర కథలు, కథా సరిత్సాగరం, బౌద్ధ జాతక కథలు, జైన పురాణ కథలు, వెయ్యిన్నొక్క రాత్రులు...

మరెన్నో అద్భుతమైన అలరించే కథలు కావాలా!







## Telugu.chandamama.com లో

ఆర్కైవ్స్ చూడండి





# కపాలిని తీర్పు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు. ''రాజా, ఎలాంటి మహత్తర కార్యం సాధించడానికి నువ్విలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. నీ పట్టుదల చూస్తూంటే అనుకున్నది సాధించి తీరగలవన్న నమ్మకం కలుగుతున్నది. అయితే, కార్యం సాధించాక కూడా ఈ దీక్షాదక్షతలు నిలుపుకోగలవా అన్నది అనుమానాస్పదమే. ఎందుకంటే కొందరిలో కార్యం సాధించేంత వరకు ఉన్న పట్టుదలా, ఆదర్శభావాలూ తీరా దానిని సాధించాక ఎందుకో నిర్వీర్యమైపోతాయి. మూఢనమ్మకాలను తుదముట్టించాలన్న ఆదర్శంతో పోరాడిన ఆదిత్యుడనే వార్తాహరుడు ఆఖరికి ఎంతో విచిత్రంగా మారిపోయాడు. నీకు తగు హెచ్చరికగా ఉండేందుకు ఆ వింత హేతువాది కథ చెబుతాను. శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:



కౌశికారణ్యం గోరువంక కోనలోని ఉడు మూరు గూడెంలో కులకట్టుబాటుకు పేరు మోసిన గొండంగి తెగకు చెందిన ఆటవికులు నివసించేవారు. వాళ్ళు భయభక్తులతో కొలిచే దేవత కపాలిని. ఆ దేవత తమను సదా సర్వ వేళలా కంటిని రెప్పలా కాపాడడంతో పాటు అవసరమైనప్పుడు తగిన తీర్పులనిచ్చి ఆదు కుంటుందన్నది గొండంగి తెగ ప్రజల అచం చల విశ్వాసం.

ఆ సంగతి సింహపురానికి చెందిన ఆది త్యుడనే వార్తాహరుడికి కుతూహలం రేకె త్తించింది. అతడు ప్రతి విషయాన్ని కార్యకారణ సంబంధంతో ఆలోచించే హేతువాది. మూఢ నమ్మకాలను తుదముట్టించాలని ఆశించే వాడు. ఆ దేవతకు సంబంధించిన వివరాలు సేకరించి, వాటిలోని నిజానిజాలను నిగ్గు తేల్చాలనుకున్నాడు. గొండంగి ప్రజల వేష భాషలను, అలవాట్లను కొద్ది రోజులపాటు అభ్యసించాడు. ఆ తరవాత కొన్నాళ్ళకు నడుముకు పులిచర్మం కట్టుకుని, తలపై ఈకల కిరీటం పెట్టుకుని గొండంగి తెగకు చెందిన యువకుడిలాగే ఉడుమూరుకు బయలుదేరాడు.

అతడక్కడికి చేరేసరికి కపాలిని ఆలయం ముందు గూడెం ప్రజల సమక్షంలో కులపెద్ద గండడు విచారణ జరుపుతున్నాడు.

ఆ గ్రామానికి చెందిన శుభాంగి అనే యువతి, ప్రియుడు బహుళుడితో కలిసి వేటకు వెళ్ళినప్పుడు, పులివాత పడి ప్రాణాలు కోల్పోయింది. వాళ్ళ సంప్రదాయానుసారం ఆ తెగకు చెందిన స్త్రీ ప్రమాదం బారినపడ్డ ప్పుడు చెంతనే ఉన్న పురుషుడు ఆమెను రక్షించకపోవడం శిక్షార్హమైన నేరం. ఆ సంప్ర దాయానుసారం మరణించిన శుభాంగి చెంతనే ఉన్న బహుళుడిపై దోషిగా నిందారోపణ చేయబడింది.

''దొరా, శుభాంగీ-నేనూ మధ్యాహ్నం నేరేడు పళ్ళు తిని చల్లటి చెట్టునీడలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాం. అంతలో అటుగా వచ్చిన ఒక లేడి కనిపించింది. నేను వారిస్తున్నా వినకుండా శుభాంగి బాణం ఎక్కుపెట్టి లేడి వెంట పరిగెత్తింది. కొంతసేపటికి ఆర్తనాదం వినిపించడంతో నేను పరుగున అక్కడికి వెళ్ళాను. కాని అంతలోనే ఆమెను చంపిన పులి పారిపోయింది. కాబట్టి ఇందులో నా నేరం ఏమీ లేదు,'' అన్నాడు బహుళుడు.

అది వినగానే నీలకంఠుడనే యువకుడు, ''బహుళుడు అబద్ధం చెబుతున్నాడని నాకని పిస్తోంది. శుభాంగి బతికి ఉండడం అతడికి ఇష్టం లేదు,'' అన్నాడు.

''అది నీకెలా తెలుసు?'' అని అడిగాడు కులపెద్ద.

''బహుళుడికి అందమైన యువతులంటే వెర్రి వ్యామోహం. అందుకే అతడు మణిదీపం లాంటి సుందరాంగి అయిన శుభాంగి వెంట పడ్డాడు. శుభాంగి కూడా అతడే తన సర్వస్వం అనుకుంటూన్న సమయంలో దురదృష్టం కొద్దీ విషపురుగు కుట్టిన కారణంగా ఆమె అందవికారిగా మారిపోయింది. అప్పటినుంచి బహుళుడు ఆమెపట్ల విముఖుడైపోయాడు. మరో అందాల యువతికి వల విసరాలంటే శుభాంగి అడ్డు తొలగించుకోవాలి కదా? అందుకే నేరం చేసి ఉండవచ్చని నేను భావి స్తున్నాను,'' అన్నాడు నీలకంఠుడు.

''నీలకంఠుడికి నా మీద తొలి నుంచీ అసూయాద్వేషాలు ఉన్నాయి. పైగా అతడు ఆ మధ్య ఎంతో శ్రమించి పట్టిన రంగు రంగుల వింతపక్షిని, నేను తీసుకుని స్వేచ్ఛగా వదిలి పెట్టాను! అందుకే నాపై పగసాధించ డానికి ఇప్పుడిలా అభాండం వేస్తున్నాడు,'' అన్నాడు బహుళుడు.

ఇరువురి వాదనలూ తోసిపుచ్చరానివిగా ఉండడంతో వాస్తవం వెల్లడి కాలేదు. బహుళుణ్ణి దేవత నిర్ణయానికి అప్పగించవలసిందిగా అక్కడున్న ప్రజలు ముక్తకంఠంతో కోరారు. దాంతో కులపెద్ద తన కర్తవ్యం నెరవేర్చమని



పక్కనే ఉన్న గుడి పూజారి గరుడవీక్షణుణ్ణి వేడుకున్నాడు.

తమ కులదేవత సర్వాంతర్యామిగనక, ఎక్కడ ఏది జరిగినా ఆమెకు తెలుస్తుంది. నేరస్థులెవరో, నిరపరాధులెవరో నిర్ణయించి శిక్షించే శక్తి కపాలిని దేవతకు ఉన్నదన్నది గూడెం ప్రజల అచంచల విశ్వాసం!

పరమ భక్తుడిగా, పక్షపాత రహితుడిగా గుడి పూజారి గరుడవీక్షణుడికి పేరున్నది. అమావాస్యనాడు రోజంతా ఉపవాస దీక్షతో గడిపిన పూజారి గరుడవీక్షణుడు సాయం కాలం ఆలయంలో పూజలు ప్రారంభించాడు. కొంతసేపటికి బహుళుణ్ణి కపాలినీ విగ్రహానికి ఎదురుగా ఉన్న రాతి స్తంభానికి కట్టేసి ఏదో పానకం తాగించాడు. ఆ పిమ్మట జనాన్ని పంపేసి తనూ వెలుపలికి వచ్చి ఆలయం



తలుపులు మూసేశాడు. ఆ రాత్రి గూడెంలో ప్రజలందరూ ఇళ్ళకు చేరి తలుపులు గడియపెట్టుకుని భయం భయంగా గడిపారు. ఎవరైనా బయటికొస్తే నెత్తురు కక్కుకు చస్తారని భయం.

తెల్లవారుతూండగా గుడిలో నుంచి బహుళుడి కేకలు వినిపించాయి. జనం పరుగు పరుగున వెళ్ళి చూశారు. అతడి కళ్ళ నుంచి కారిన నెత్తురు చెంపల మీద చారలు కట్టి కనిపించాయి.

''ఆ రోజు నేనే ఆడపులిలా అరిచి మగపులి మా వైపు వచ్చేలా ఆకర్షించాను. పులివచ్చి శుభాంగిపై దాడి చేసినప్పుడు పక్కకు తప్పుకున్నాను. దేవత నాకు తగిన శిక్షే విధించింది,'' అంటూ బహుళుడు పశ్చాత్తాపంతో వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

అతడి తల్లిదండ్రులు అతణ్ణి పట్టుకుని విలవిలలాడిపోతున్నారు.

మరొక యువతిని కన్నెత్తి చూడకుండా బహుళుడికి తగిన శాస్తి జరిగిందని జనం అమ్మవారిని తలుచుకుని లెంపలు వేసుకున్నారు.

ఇదంతా ఆదిత్యుడికి చాలా అన్యాయంగా తోచింది. అయినా తను గుడిలో చూసిన రహస్యాన్ని బయటపెట్టి ప్రజల కళ్ళు తెరిపించడానికి తగిన సమయం కోసం ఎదురు చూడసాగాడు.

నాలుగు రోజుల తరవాత బహుళుడి తండ్రి శంఖచూడుడు ఆదిత్యుడికి ఒంటరిగా అడవిలో తారసపడ్డాడు. కొడుక్కు పట్టిన దుర్గతి వల్ల కలిగిన బాధ నుంచి కోలుకోకపోయినప్పటికీ ఉదర పోషణ కోసం ఆయన అడవికి రాక తప్పలేదు.

ఆదిత్యుడు ఆయన్ను సమీపించి, ''నీ కొడుక్కు తీరని అన్యాయం జరిగింది. గరుడవీక్షణుడు జలపాతం వద్దకు స్నానానికి వెళ్ళేప్పుడు, రహస్యంగా అతడి ఇంట్లోకి జొరబడి పూజామందిరంలో అమ్మవారి విగ్రహానికి పక్కనున్న మీటను నొక్కు. వెంటనే విగ్రహం పక్కకు తొలగి సొరంగమార్గం కనబడుతుంది. అది ఎక్కడికి వెళుతుందో తెలుసుకుని రా,'' అన్నాడు.

శంఖచూడుడు మరునాడు ఆదిత్యుడు చెప్పినట్టే చేశాడు. గుడికి పక్కనే ఉన్న పూజారి ఇంటి నుంచి సొరంగమార్గం ఆలయం లోపలికి ఉన్నట్టు గుర్తించి అమితాశ్చర్యానికి

లోనయ్యాడు. ఆ రోజు మధ్యాహ్నం అడవిలో ఆదిత్యుణ్ణి కలుసుకుని తను చూసింది చెప్పాడు.

''అసలు ఏం జరిగిందో ఇప్పుడు చెబుతాను విను. పూజారి నీ కొడుక్కు తాగించిన పానకంలో మత్తుమందు కలిపాడు. చాటుగా గరుడవీక్షణుణ్ణి అనుసరించి వెళ్ళిన నేను అతడు నీ కొడుకు కళ్ళు పొడవడం స్వయంగా చూశాను. మత్తులో ఉన్నందువల్ల నీ కొడుకు అది అమ్మవారి పనే అని భ్రమపడ్డాడు. అమ్మవారి పేరుతో గరుడవీక్షణుడు మీకు తీరని ద్రోహం చేస్తున్నాడు,'' అన్నాడు ఆదిత్యుడు.

అతడు చెప్పిన విషయం ఆశ్చర్యం కలిగించినప్పటికీ వెంటనే ఒక నిర్ణయానికి వచ్చిన శంఖచూడుడు, ''మా గూడానికి చెందిన వాళ్ళెవరూ మా కులదేవత కపాలినిని సందేహించడానికి సాహసించరు. ఇంత ధైర్యంగా రహస్యాన్ని ఛేదించావంటే నువ్వు తప్పకుండా నాగరిక ప్రపంచానికి చెందిన నాస్తికుడివై ఉంటావు! అవునా?'' అని అడిగాడు.

''అవును,'' అంటూ తననుగురించిన వివరాలు దాచకుండా తెలియజేశాడు ఆదిత్యుడు.

''శిక్ష విధించింది గరుడవీక్షణుడే అయినప్పటికీ నా కొడుకు చేసిన నేరానికి అది తగినదే. నా కొడుక్కు శిక్ష పడినందుకు నేను బాధపడడం లేదు. వాడా నేరం చేసినందుకు చింతిస్తున్నాను. దేవత దండిస్తుందన్న భయంతో మా గూడెంలో నేరానికి ఎవరూ పాల్పడరు. ఇలాంటివి చాలా అరుదుగానే జరుగుతూ ఉంటాయి. దేవత పట్ల భయం నశిస్తే మా



గూడెంలో అరాచకం మొదలవుతుంది. నువ్వు కనుగొన్న నిజం సమాధి కావాలంటే నువ్వు మరణించాలి. ఆ నిజం తెలిసిన నేను కూడా బతకకూడదు,'' అంటూ శంఖచూడుడు హఠాత్తుగా ఆదిత్యుణ్ణి గట్టిగా పట్టుకుని కొండ శిఖరం నుంచి అగాధంలోకి దూకేశాడు.

శంఖచూడుడు కింద పడిన వెంటనే ప్రాణాలు కోల్పోయాడు. అదృష్టవశాత్తు గుబురు పొదలలో పడి కొనప్రాణాలతో కొట్టుమిట్టాడుతూన్న ఆదిత్యుణ్ణి బాటసారులు కాపాడారు. అయితే, ఆ తరవాత ఆదిత్యుడు సింహపురం చేరి ఉద్యోగం విరమించుకుని తాను కనుగొన్న రహస్యం ఊసెత్తకుండా మౌనంగానే ఉండిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, మూఢ నమ్మకాలు ఎంతటి దారుణమైన పర్యవ

సానాలను కలిగిస్తాయో ఆదిత్యుడికి తెలుసు. అందువల్లే అతడు అరణ్య మధ్యంలో ఉన్న గూడానికి వెళ్ళి పూజారి రహస్య కార్యకలాపాలను కనుగొనడానికి ప్రాణాలను సైతం లెక్కచేయకుండా శ్రమించాడు. అటువంటి ఆదర్శవంతుడు తన నిర్ణయం ఎందుకు మార్చుకున్నాడు? కొండపై నుంచి కింద పడడంతో ప్రాణభయంతో అతనిలోని ఆదర్శ భావాలు అడుగంటిపోయాయా? ఇంకేదైనా కారణం ఉన్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''విశ్వాసాలన్న తరవాత ఏవి మంచి విశ్వాసాలు? ఏవి మూఢ విశ్వాసాలు? అని విడదీసి తేల్చి చెప్పడం అంత సులభం కాదు. దేశ కాల పరిస్థితులను బట్టి ఇవి మారుతూ ఉంటాయి. ఎక్కువ మందికి మేలు కలిగించినంత కాలం ఏ విశ్వాసాన్నయినా తప్పు పట్టలేము. అనుదిన జీవితంలో ఎన్నో విశ్వాసాలు కనిపిస్తూంటాయి. దైవభక్తి, పాపభీతి మొదలైనవి ఇలాంటి విశ్వాసాలే. కొన్ని పరిస్థితులలో దైవభీతి మనుషుల్ని హద్దుల్లో ఉంచుతాయి. కొన్ని దశలలో అవి లేకపోతే విచ్చలవిడితనం, అరాచకం ప్రబలే ప్రమాదం ఉన్నది. అలాంటి ఒక విశ్వాసాన్ని నిలబెట్టడానికి శంఖచూడుడు చేసిన ప్రాణత్యాగం, ఆదిత్యుడి కళ్ళు తెరిపించింది. పైగా, గరుడవీక్షణుడు తన స్వార్థం కోసం దేవతను అడ్డుపెట్టుకుని నాటకం నడిపించలేదు. గూడెం ప్రజల మేలుకోరి, న్యాయాన్యాయాలు విచారించి, ధర్మాధర్మాలు పరిశీలించి, దేవతపై భారం వేసి బహుళుడికి శిక్ష విధించాడు. అందువల్ల పూజారిని నిందించడం భావ్యం కాదు. ఇవన్నీ ఆలోచించడం వల్లే ఆదిత్యుడు తాను కనుగొన్న రహస్యాన్ని తనలోనే దాచుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

*[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యం రచన]*




నీ కోపమే నీ కొంప ముంచింది!
ఎవరు నువ్వు?
ఒకానొకప్పుడు ఒక యువరాణి ఉండేది!
అప్పుడు అది నిజం! నువ్వు తిరిగి వచ్చావు!
నేనెప్పుడూ వెళ్ళ లేదు


ఆడతోడేలు సలహా ప్రకారం, ఆర్య కొంత దూరం అవతలికి వెళ్ళాడు.
నేనిది నమ్మను!


ముని చెప్పినట్టు... అది మారీఘా అయివుంటుందా?


అంటే నేను వెతుకుతున్నది నీకు తెలుసన్నమాట.


అప్పుడు నాకు సాయపడవచ్చు కదా?


నాకు తెలుసు.


నీకు నేను సాయపడతాను!


వాళ్ళు స్నేహితులై పోతున్నట్టుంది...


మరి, అది నన్నెందుకు కాపాడినట్టు?




అది కనిపిస్తున్నంత వాస్తవం కాదు.




అయినా, నమ్మకద్రోహాలు లేకుండా మర్మం ఎలా ఉంటుంది?

(ఇంకా ఉంది)



# యుద్ధ కాండ-9

సుగ్రీవుడు కుంభకర్ణుడి చెవులూ, చెక్కిళ్ళూ కొరికి ఒక్క గెంతుతో రాముడి వద్దకు వెళ్ళి పోయాక కుంభకర్ణుడు దేహమంతా రక్త ధారలు కారుతూ, ఒక్క క్షణం పాటు కొండ లాగా నిలబడిపోయి, తిరిగి యుద్ధ భూమికే బయలుదేరాడు. తన చేతిలో ఆయుధం లేదని జ్ఞాపకం వచ్చి అతనొక భయంకరమైన ముద్గరాన్ని దారిలోనే ఎత్తుకుని యుద్ధరం గానికి వెళ్ళాడు. అక్కడ అతను కోపావేశంతో కనిపించిన ప్రాణులన్నిటినీ పట్టుకుని తిన సాగాడు.

ఇది చూసి లక్ష్మణుడు కుంభకర్ణుణ్ణి ఎదిరించి, అతనిపై బాణాలు వేశాడు. కాని ఆ బాణాలను కుంభకర్ణుడేమాత్రమూ లక్ష్య పెట్టలేదు. అతను అందిన వానరులను పట్టు కుని తింటూ రాముడికేసి పోసాగాడు. రాము డొక భయంకరమైన అస్త్రాన్ని వేసి కుంభకర్ణుడి రొమ్ములో కొట్టాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడి నోట జ్వాలలు వెలువడ్డాయి. అతను అక్కడే పడిపోయాడు.

కుంభకర్ణుడు మళ్ళీ లేవకుండా అతనిపై ఎక్కి నుంచోమని లక్ష్మణుడు వానరులతో చెప్పాడు. అయితే కుంభకర్ణుడు తనపైకి ఎక్కిన వానరులను చీమలను దులిపినట్టు దులిపేశాడు. అది చూసి రాముడు కుంభ కర్ణుణ్ణి సమీపించి తన వింటి నారిని మోగిం చాడు. కుంభకర్ణుడు లేచి నిలబడి పెద్ద పర్వతంలాగా రాముడికెదురు వచ్చాడు.

రాముడతన్ని చూసి, ‘‘కుంభకర్ణా, భయ పడకు! రా! ఇంద్రుణ్ణి జయించావు కాబోలు.





కర్ణుడి రెండో చేతిని కూడా, చెట్టుతో సహా, నరికేశాడు. తరవాత అతను రెండు అర్ధచంద్ర బాణాలతో కుంభకర్ణుడి పాదాలు నరికేశాడు. కుంభకర్ణుడు పర్వతంలాగా విరుచుకుపడి పోయి, గుహ లాంటి నోరు తెరిచి గర్జిస్తుంటే, రాముడా నోటి నిండా బాణాలు కొట్టాడు. కుంభకర్ణుడు మూర్ఛపోయి ఉన్న స్థితిలో రాముడొక దివ్యాస్త్రంతో కుంభకర్ణుడి తల నరికేశాడు.

కుంభకర్ణుడు రాముడి చేత చచ్చాడన్న వార్త వింటూనే రావణుడు మూర్ఛపోయి తరవాత తమ్ముడి కోసం దుఃఖించాడు.

తమ్ముడి కోసం దుఃఖిస్తున్న రావణుణ్ణి ఓదార్చి, త్రిశిరుడూ, అతికాయుడూ, దేవాంతకుడూ, నరాంతకుడూ, మహోదరుడూ, మహాపార్శ్వుడూ అనే ఆరుగురు రాక్షస యోధులు యుద్ధానికి బయలుదేరారు.

తిరిగి రాక్షస వానర సేనల మధ్య దొమ్మి యుద్ధం ఆరంభమయింది. నరాంతకుడు వానర సేన మధ్యకు జొరబడి, తన ఈటెతో వానరులను వందల సంఖ్యలో చంపసాగాడు. అప్పుడు సుగ్రీవుడు అంగదుణ్ణి అతనిపైకి పంపాడు.

అంగదుడు నరాంతకుడికి ఎదురు వెళ్ళి, "ఆ ఈటెను సాధారణ వానరుల పైన ఎందుకు ప్రయోగిస్తావు? దానితో నన్ను కొట్టు," అన్నాడు. నరాంతకుడు తన ఈటెను బలంగా అంగదుడి రొమ్ము మీద కొట్టాడు. అది కాస్తా విరిగి పడిపోయింది. అంగదుడు నరాంతకుడెక్కి ఉన్న గుర్రాన్ని నెత్తిమీద అరచేత్తో

నేను ఇంద్రుణ్ణి కాదు, రాముణ్ణి! నిన్నిప్పుడే ఒక్క క్షణంలో చంపబోతున్నాను," అన్నాడు.

'నేను కూడా విరాధుణ్ణి కాను; కబంధుణ్ణీ, ఖరుణ్ణీ, వాలినీ, మారీచుణ్ణీ కూడా కాను; కుంభకర్ణుణ్ణి! వచ్చాను! నీ ప్రతాపమేమిటో నాకు చూపించు, ఆ తరవాత నిన్ను తినేస్తాను," అన్నాడు కుంభకర్ణుడు.

రాముడు వేసిన మామూలు బాణాలు కుంభకర్ణుణ్ణి ఏమీ చెయ్యలేక పోయాయి.

అప్పుడు రాముడు కుంభకర్ణుడిపైన వాయువ్యాస్త్రం ప్రయోగించాడు. అది ముద్గరం పట్టి ఉన్న కుంభకర్ణుడి చేతిని ఖండించేసింది. కుంభకర్ణుడు పెద్దగా అరిచాడు.

కుంభకర్ణుడు ఒక చెయ్యి పోగొట్టుకుని, రెండో చేత్తో ఒక మహావృక్షాన్ని పెరికి రాముడి పైకి వచ్చాడు. రాముడు ఐంద్రాస్త్రంతో కుంభ

చరిచే సరికి అది తల పగిలి చచ్చిపోయింది. నరాంతకుడు తన పిడికిలి బిగించి గట్టిగా మొట్టేసరికి అంగదుడి తల పగిలి రక్తం కార సాగింది. ''వీడి కింత బలం ఉందా?'' అని ఆశ్చర్యపడి అంగదుడు తన పిడికిలి బిగించి నరాంతకుడి రొమ్ములో గట్టిగా పొడిచేసరికి నరాంతకుడు నెత్తురు కక్కుకుని చచ్చాడు.

అది చూసి మహోదరుడూ, దేవాంతకుడూ, త్రిశిరుడూ అంగదుడిపైకి వచ్చారు. ఆ ముగ్గురితోనూ ఒంటరిగా పోరాడుతూన్న అంగదుడికిహనుమంతుడూ, నీలుడూ తోడు వచ్చారు. వారి మధ్య జరిగిన యుద్ధంలో హనుమంతుడు దేవాంతకుణ్ణి తల పగలగొట్టి చంపేశాడు. అలాగే నీలుడి చేతిలో మహోదరుడు చచ్చాడు. మళ్ళీ హనుమంతుడే త్రిశిరుడితో చాలా సేపు యుద్ధం చేసి అతని కత్తితోనే అతని కంఠం నరికేశాడు.

ఈ లోపల రాక్షస వీరులలో ఒకడైన మహాపార్శ్వుడు భయంకరమైన గద ఒకటి తీసుకుని వానరుల పైకి పోయేసరికి, ఋషభుడనే వానరవీరుడు అతనితో తలపడి, అతని గద చేత కొట్టబడి కూడా, ఆ గదతోనే మహాపార్శ్వుడి తల పగలగొట్టేశాడు. మహాపార్శ్వుడు కూడా చావగానే రాక్షసులు ఆయుధాలు పారేసి పారిపోయారు.

అలా పారిపోయే రాక్షసులను చూసి, అతికాయుడు చాలా కోపంచెంది, రెండో కుంభకర్ణుడి లాగా వానరసేనపై పడ్డాడు.

"ఇతను రావణుడికి ధాన్యమాలిని యందు పుట్టిన కొడుకు, అతికాయుడు. లంకకు



ఇతను కూడా పెట్టనికోట లాంటివాడే. బ్రహ్మనారాధించి దివ్యాస్త్రాలు పొందినవాడు. ఇతని సంగతి వెంటనే తేల్చకపోతే వానరసేనను బాణాలతో నాశనం చేయగలడు,'' అని విభీషణుడు రాముడికి చెప్పాడు.

ఈ లోపల అతికాయుడు సింహనాదం చేస్తూ వానరసేనలో ప్రవేశించాడు. కుముదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, నీలుడూ, శరభుడూ ఏకమై అతన్నెదిరించారు. అతను వారందరినీ ఉక్కుబాణాలతో కొట్టి బాధించాడు. తరవాత అతను రాముడున్న చోటికి వచ్చి, 'నేను అల్పులతో యుద్ధం చెయ్యను, సమర్థుడెవడన్నా ఉంటే నాతో యుద్ధానికి రావచ్చు,'' అన్నాడు.

ఆ మాట విని లక్ష్మణుడు రోషంతో అతని ముందుకు వచ్చి తన వింటినారిని మోగించి



సవాలు చేశాడు. ''లక్ష్మణా, నువ్వు అర్భకుడివి, నాతో యుద్ధం చేసి, నిష్కారణంగా ప్రాణాలు పోగొట్టుకోకు,'' అన్నాడు అతికాయుడు.

''నీ ప్రతాపం ఉత్తమాటలలో గాక, చేతలలో చూపించు,'' అన్నాడు లక్ష్మణుడు.

ఇద్దరూ బాణాలతో యుద్ధం ప్రారంభించారు. ఒకరినొకరు బాణాలతో నొప్పించారు. ఒకరి బాణాల నొకరు పడగొట్టారు. అతికాయుడు అభేద్యమైన కవచం ధరించి ఉండటం చేత లక్ష్మణుడి బాణాలు అతన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. ఈ సంగతి గ్రహించి, లక్ష్మణుడు బ్రహ్మాస్త్రం ప్రయోగించి అతికాయుడి తల నరికేశాడు.

ఆరుగురు మహాయోధులైన రాక్షస వీరులూ చచ్చారని వినగానే రావణుడు అంతులేని దుఃఖసముద్రంలో మునిగిపోయాడు. అప్పుడు ఇంద్రజిత్తు తన తండ్రిని చూసి, ''ఇంద్రజిత్తు బతికి ఉండగానే ఈ విచారం దేనికి? నేనిప్పుడే వెళ్ళి ఆ రామలక్ష్మణులను యుద్ధంలో చంపి తిరిగి వస్తాను,'' అన్నాడు. రావణుడు సరేనన్నాడు.

ఇంద్రజిత్తు ఉత్తమమైన గాడిదలు కట్టిన రథం పైన ఎక్కి, రాక్షసులతో యుద్ధభూమికి బయలు దేరాడు.

యుద్ధభూమిలో, తన రథం చుట్టూ రాక్షసులను కాపలా ఉంచి, ఇంద్రజిత్తు హవిస్సులను హోమం చేసి, నల్లమేకను బలి ఇచ్చాడు. అగ్ని పొగలేకుండా మండి అతనికి విజయాన్ని సూచించింది. తరవాత ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రం జపించి, దానితో తన ధనుస్సునూ, రథాన్నీ అభిమంత్రించాడు. ఇదంతా పూర్తి అయ్యాక ఇంద్రజిత్తు తన రథంతోనూ, సారథితో సహా ఆకాశంలోకి వెళ్ళి అంతర్ధానమైపోయాడు. రాక్షససేన అమితోత్సాహంతో యుద్ధానికి కదిలింది.

వానరసేనపై దారుణమైన హత్యాకాండ సాగింది. ప్రముఖ వానరవీరులైన గంధమాదనుడూ, నలుడూ, మైందుడూ, గజుడూ, జాంబవంతుడూ, సుగ్రీవుడూ, ఋషభుడూ, అంగదుడూ, ద్వివిదుడూ ఇంద్రజిత్తు ప్రయోగించిన తీవ్రమైన బాణాలతో గాయపడ్డారు; కొందరు మూర్ఛపోయారు. ఇంక చచ్చిన వానరులకు లెక్కే లేదు. ఇంద్రజిత్తు ఆకాశంలో ఎక్కడ ఉన్నదీ వానరులకు కనిపించనైనా లేదు.



ఇంద్రజిత్తు కురిపించే బాణవర్షం రామలక్ష్మణులపైన కూడా పడింది. రాముడు లక్ష్మణుడితో, ''కంటికైనా కనిపించని ఈ ఇంద్రజిత్తుతో యుద్ధం చెయ్యటం మనకు సాధ్యమయ్యే పని కాదు. అతని అస్త్రాల ఫలితంగా వానరసేన అంతా మూర్ఛపడి ఉన్నది. మనం కూడా మూర్ఛ వచ్చినట్టు పడిపోతే ఇంద్రజిత్తు వెళ్ళిపోతాడు,'' అన్నాడు.

రామలక్ష్మణులు కూడా మూర్ఛితులైపడినట్టు కనిపించగానే ఇంద్రజిత్తు పరమ సంతోషంతో లంకకు తిరిగి వెళ్ళాడు. రామలక్ష్మణులు మూర్ఛలో ఉండటం చూసి వానరసేన కలవరం చెందింది.

రామలక్ష్మణులను చూసి కంగారు పడే వానరులతో విభీషణుడు, ''మీరు కంగారు పడకండి. రామలక్ష్మణులు మూర్ఛ నటిస్తున్నారు, అంతే!'' అన్నాడు.

రాత్రి, చీకటి. మూర్ఛపడి ఉన్న వానరులలో ప్రాణాలతో ఉన్న వారెవరో, చచ్చిన వారెవరో తెలియటం లేదు. అందుచేత హనుమంతుడూ, విభీషణుడూ చెరొక కొరవి తీసుకుని వెదక నారంభించారు. ఇంద్రజిత్తు ఆ సాయంకాలం అయిదు గడియల కాలంలో అరవై ఏడు కోట్ల వానరులను పడగొట్టాడు. పడిపోయిన వారిలో సుగ్రీవుడూ, అంగదుడూ, నీలుడూ, శరభుడూ మొదలైన వారెందరో వారికి కనిపించారు. వారు జాంబవంతుడి కోసం వెతికారు. మహా వృద్ధుడైన జాంబవంతుడు స్పృహతోనే కనిపించాడు. విభీషణుడు జాంబవంతుణ్ణి సమీపించి, ''తాతా, ప్రాణాలతో ఉన్నావు గద!'' అన్నాడు. ఎంతో ఆత్రుతగా.

జాంబవంతుడు హీనస్వరంతో, ''ఆ మాట్లాడేది విభీషణుడా, నాయనా? నాకు కళ్ళు కనిపించటం లేదు. హనుమంతుడు బాగా ఉన్నాడా?'' అని అడిగాడు.

''తాతా, సుగ్రీవుణ్ణీ, అంగదుణ్ణీ, రామలక్ష్మణులనూ గురించి అడగకుండా హనుమంతుడి మాట అడుగుతున్నావేం?'' అని విభీషణుడన్నాడు.

''హనుమంతుడి మాట ఎందుకడిగానంటావా? చెబుతా విను. హనుమంతుడొక్కడే ఉండి ఈ వానరసేన అంతా చచ్చినా అది బతికి ఉన్నట్టే. అలా కాక హనుమంతుడు పోయి వానరసేన అంతా బతికి ఉన్నప్పటికీ అది చచ్చిన దానితో సమానమే. నాయనా, ఆ

రామాయణం క్విజ్ జూలై 2009
సరైన సమాధానం: **B**
విజేత: శ్రీకర్, ఆదిలాబాద్ (ఆం.ప్ర)

హనుమంతుడు బతికి ఉన్నంతకాలమే మాకు జీవితం పైన ఆశ!'' అన్నాడు జాంబవంతుడు.

ఈ మాటలు వింటున్న హనుమంతుడు గౌరవభావంతో జాంబవంతుణ్ణి సమీపించి, అతని కాళ్ళు పట్టుకుని నమస్కారం చేశాడు.

హనుమంతుడి కంఠం వినిపించగానే జాంబవంతుడికి ప్రాణం లేచి వచ్చింది.

''నాయనా, హనుమంతుడా! ఇలారా! ఈ వానరులను కాపాడే భారం ఇప్పుడు నీదే. ఈ పని నీవల్ల తప్ప మరొకరి వల్ల కాదు. నువ్వు సముద్రం దాటి హిమవత్పర్వతానికి వెళ్ళాలి. అక్కడ అన్నిటికన్న ఎత్తుగా కనిపించే శిఖరాలు ఋషభమూ, కైలాసమూనూ. ఆ రెంటికీ నడుమగా ఓషధీ పర్వతం ఉన్నది. దాని శిఖరం మీద కాంతివంతమైన దివ్య ఓషధులు నాలుగున్నాయి. వాటిపేరు విశల్యకరణీ, మృతసంజీవినీ, సౌవర్ణకరణీ,



సంధానకరణీ. ఆ నాలుగు ఓషధులనూ తీసుకుని శీఘ్రంగా తిరిగిరా!'' అని జాంబవంతుడు హనుమంతుణ్ణి హెచ్చరించాడు. వాటితో వానరులను బతికించవచ్చునని ఆయన అన్నాడు.

వెంటనే హనుమంతుడా రాత్రివేళ ఒక్క దూకున పర్వత శిఖరం మీదికి ఎక్కి శరీరం పెంచి, రాక్షసులు హడలుకునేటట్టుగా పెడబొబ్బ పెట్టి ఆకాశంలోకి లేచాడు.





# స్వీడన్ జానపద కథ

## రుచికరమైన రాతివంటకం

ఒకానొకప్పుడు ఒక బాటసారి ఒక గ్రామం గుండా వెళుతున్నాడు. అప్పటికే బాగా పొద్దు పోవడంతో ఆ రాత్రికి విశ్రాంతి తీసుకోవడానికి ఏదైనా చోటు దొరుకుతుందా అని వెదకసాగాడు. వెచ్చని చలిమంటల ముందు కూర్చుని వేడి వేడి సూప్ తాగుతూ ఉంటే ఎంతో హాయిగా ఉంటుంది కదా అన్న ఆలోచన అతడి మనసులో ఉత్సాహాన్ని కలిగించింది. దూరంగా ఒక చిన్న ఇల్లు కనిపించడంతో అక్కడ ఏదైనా తినడానికి దొరకగలదన్న ఆశతో అతడు దానికేసి నడిచాడు.

ఆ ఇంటి తలుపు తట్టగానే ఒక ముసలావిడ తలుపు తెరిచి అతణ్ణి వింతగా చూసింది. ''రాత్రికి తలదాచుకోవడానికి చోటు ఇస్తారా?'' అని అడిగాడు బాటసారి. ''ఇవ్వనుగాక, ఇవ్వను. ఇదేం ధర్మసత్రం కాదు,'' అన్నది ముసలావిడ.

''ఈ రోజంతా నేనేమీ తినలేదు. ఏదైనా తినడానికి ఉంటే ఇంత పెట్టు. నీ మేలు మరవను,'' అన్నాడు బాటసారి.

''నాకే తిండి లేదు. దారిన పోయే దానయ్యకల్లా తలుపు తట్టగానే భోజనం పెట్టడానికి ఇక్కడేమీ పోసిపెట్టి లేదు,'' అని గొణుక్కున్నది ముసలావిడ విసుగ్గా.

తలుపు మూయడానికి ప్రయత్నించిన ముసలావిడను బాటసారి ఎంతగానో బతిమలాడి ఆ రాత్రికి అక్కడే ఉండడానికి అనుమతి పొందాడు. ''పాపం కదా అని పడుకోవడానికి అనుమతిస్తున్నాను. అంతేగాని, తిండి కూడా పెట్టగలనని ఆశించకు సుమా!'' అని హెచ్చరించింది ముసలావిడ. ''చలిరాత్రిలో ఒంటరిగా బయట అలమటించడం కన్నా, కాస్త వెచ్చగా ఉన్నచోట పడుకునే అవకాశం ఇచ్చావు. చాలా కృతజ్ఞతలు!'' అన్నాడు బాటసారి.



కొంతసేపటికి బాటసారి, ''మను ఇలా ఆకలితో బాధపడడం చాలా సిగ్గుచేటైన విషయం. ఎందుకంటే నా దగ్గర అద్భుతశక్తిగల ఒక రాయి ఉంది. నువ్వు అక్కడున్న రాగిపాత్రను ఇచ్చావంటే నిమిషాల్లో నేను

విజయవాడకు ఆ పేరు ఎలా వచ్చింది? వివరాలకు telugu.chandamama.com చదవండి

రుచికరమైన 'స్టోన్(రాతి) సూప్' చేసి ఇవ్వగలను,'' అన్నాడు.

ముసలావిడ అతడికేసి నమ్మలేనట్టు చూస్తూ, ''ఏమిటీ! రాతి సూపా?'' అన్నది. ''ఔను. నిజం, రాతిసూపే. వివిధ ప్రాంతాలు తిరిగితేనే ఇలాంటి కొత్తకొత్త విషయాలు చాలా నేర్చుకోడానికి వీలవుతుంది,'' అన్నాడు బాటసారి గొప్పగా. తరవాత అతడు సంచీలోంచి కాగితంలో భద్రంగా చుట్టి ఉన్న ఒక చిన్న రాయిని బయటకు తీశాడు.

''నేను నా జీవితంలో ఎన్నో వింతలు, విశేషాలు చూశాను, విన్నాను. కాని రాతి సూపును గురించి నేనెన్నడూ విననే లేదు. నేను దీన్ని గురించి పక్కింటావిడకు చెబితే నోరు వెళ్ళబెడుతుంది,'' అనుకుంటూ ముసలావిడ వంట గదిలోకి వెళ్ళి రాగిపాత్రను తెచ్చింది. బాటసారి దాన్ని పొయ్యి మీద పెట్టి, నీళ్ళు పోసి రాతిని అందులోకి మెల్లగా జారవిడిచాడు. నీళ్ళు వేడెక్కగానే కొయ్యగరిటను తీసుకుని కలియబెట్టసాగాడు. అతణ్ణి పరిశీలనగా చూస్తూ ముసలావిడ అక్కడే కూర్చున్నది.

మరి కొంతసేపయ్యాక అతడు సూప్‌ను కొద్దిగా తీసి రుచి చూశాడు. అతడు ఏదో ఆలోచిస్తున్నవాడిలా, ''సూప్ మరీ పలచగా ఉందనుకుంటాను. ఏదైనా పిండిగానీ, ఓట్‌మీల్ గానీ కొద్దిగా కలిపితే చిక్కగా తయారవుతుంది,'' అన్నాడు.

''అంతే కదా, వంటగదిలో కొద్దిగా ఓట్‌మీల్ ఉందనుకుంటాను. ఇప్పుడే తెస్తాను,'' అంటూ లేచి వంటగదిలోకి వెళ్ళిన ముసలావిడ మరుక్షణమే గుప్పెడు ఓట్‌మీల్‌తో తిరిగి వచ్చి, దాన్ని పాత్రలో వేసి కలియబెట్టసాగింది.

''సూప్ బాగా వస్తోంది. నాలుగు పొటాటోలు వేస్తే అది మరింత బావుంటుందనుకుంటాను,'' అన్నాడు బాటసారి. ''బుట్టలో పొటాటోలను చూసినట్టు గుర్తు. వస్తానుండు,'' అంటూ లేచి వెళ్ళిన ముసలావిడ కొంతసేపటికి పొటాటోలతో పాటు టొమాటోలు కూడా తీసుకువచ్చింది. ''అద్భుతం! సూప్ బ్రహ్మాండంగా వస్తోంది!'' అని మురిసిపోయిన బాటసారి వాటిని చకచకా ముక్కలుగా తరిగి సూప్‌లో కలిపాడు.



అతడు మళ్ళీ సూప్‌ను రుచి చూశాడు. ''రాతి సూప్ ప్రత్యేకత ఏమిటో తెలుసా? కొన్ని మాంసం ముక్కలు వేస్తే దాని రుచే వేరు. నీ దగ్గర ఇప్పుడు మాంసం ముక్కలు



ఉండవనుకుంటాను. ఫరవాలేదు,'' దాని గురించి మరిచిపో,'' అన్నాడు. అయితే ముసలావిడ వెంటనే మళ్ళీ లోపలికి వెళ్ళి షెల్ఫ్‌లోని కూజాలన్నిటినీ వెదకసాగింది. ఒకకూజాలో ఉప్పు మాంసం ముక్కలు కొన్ని కనిపించడంతో ఆ కూజాతోసహా తిరిగి వచ్చింది.

బాటసారి జార్‌లోని మాంసం ముక్కలు తీసి సూప్‌లో పడేశాడు. ''ఇలాంటి సూప్ నీ జన్మలో రుచి చూసి ఉండవు. నువ్వెంతో అదృష్టవంతురాలివి,'' అన్నాడు.

''కొన్ని ఉల్లిపాయల ముక్కలు కలిపితే సూప్ మరింత రుచిగా ఉంటుందేమో!'' అన్నది ముసలావిడ.

''అదే గనక కలిపినట్టయితే, రాజు తీసుకునేంత గొప్పగా వస్తుంది,'' అన్నాడు బాటసారి.

''నిజంగానా? అలా అయితే వాటిని కూడా తెస్తానుండు,'' అంటూ లేచి వెళ్ళిన ముసలావిడ ఉల్లిపాయల బుట్టతో తిరిగి వచ్చింది. అతడు రెండు ఉల్లిపాయల్ని చిన్న చిన్న ముక్కలుగా తరిగి సూప్‌లో కలిపాడు. వెనక్కు తిరిగి చూస్తే ముసలావిడి జాడ కనిపించలేదు.

మరి కొంతసేపయ్యాక ప్లేట్ల చప్పుడు వినిపించింది. ముసలావిడ బ్రెడ్ ముక్కలతో రెండు పళ్ళాలు పట్టుకు వచ్చింది. ''అద్భుతమైన రాతి సూప్‌తో ఒక బ్రెడ్ స్లయిస్ కలుపుకు తింటే మరీ బావుంటుందనుకున్నాను,'' అన్నది ముసలావిడ. ''అవును నిజమే, చాలా బావుంటుంది!'' అన్నాడతడు.

సూప్ చిక్కగా తయారయింది. అంతటి రుచికరమైన సూప్‌ను తన జీవిత కాలంలో ఎన్నడూ రుచి చూసింది లేదన్నది ముసలావిడ! ఇద్దరూ తనివితీరా సూప్‌ను బ్రెడ్ ముక్కలతో కలిపి తీసుకున్నారు. పాత్రలో రాయి తప్ప మరేదీ మిగలలేదు. దాన్ని కొయ్య గరిటతో కదిలిస్తూ, ''ఈ రాయికి నిజంగా అద్భుతమైన శక్తి ఉంది,'' అన్నది ముసలావిడ.

ఆ రాత్రి బాటసారి అక్కడే హాయిగా నిద్రపోయాడు.

మరునాడు తెల్లవారగానే బాటసారి బయలుదేరబోతూ మహిమ గల రాతిని వెలుపలికి తీశాడు. ''రాతి సూప్ తయారు చేయడానికి పాత్రనిచ్చినందుకు చాలా కృతజ్ఞతలు. ఇదిగో ఈ రాయిని నువ్వే ఉంచుకోవచ్చు. ఇది నీకు నేనిచ్చే చిరుకానుక!'' అన్నాడు బాటసారి.

ముసలావిడ అమితాశ్చర్యం చెందింది. ''మరి నీకు రాతి సూప్ తయారు చేసుకోవడానికి దాని అవసరం లేదా?'' అని అడిగింది.

అతడు సమాధానం చెప్పలేదు. నర్మగర్భంగా చిన్నగా నవ్వుతూ అక్కడి నుంచి బయలుదేరాడు.

# జాతక కథలు

పునఃకథనం: చందమామ

## అశంక!

## 2

ఆశ్చర్యపోయిన రాజు అడవికి బయలుదేరాడు.

మునివర్యులకు నమస్కారం!

నీకేం కావాలి? మంత్రోపదేశమా? సంపదలా? భార్యయా?

మునివర్యులు అంత కఠినంగా మాట్లాడుతున్నారెందుకు?

రాజులనూ, వారి వింత కోర్కెలనూ వినడానికి నాకు ఓపిక లేదు.

నిజానికి, నేనిక్కడికి భార్యకోసమే వచ్చాను మునివర్యా.

అమ్మా, నీకు సమ్మతమేనా?

మొదట రాజు నా పేరేమిటో చెప్పనివ్వండి!

సరే అలాగే చెప్పు.

అది ఏదైనా కావచ్చు! నేనెలా చెప్పను?

మీకున్నట్టే మా వింత కోరికలు మాకూ ఉంటాయి!

రాజు వెళ్ళి పండితులతో చర్చించి పేర్ల జాబితాతో తిరిగి వచ్చాడు.




ఆమె పేరును ఊహించడానికి ప్రయత్నిస్తూ రాజు కొన్ని రోజులు అక్కడే గడిపాడు.









# వేగ సూత్రం



**ఈ నెల సమస్య:**

పాఠశాల వార్షికోత్సవం సందర్భంగా అతిథులకూ, ఉపాధ్యాయులందరికీ పుష్పగుచ్ఛాలిచ్చి గౌరవించాలని నిర్ణయించారు. ఒక్కొక్క పుష్పగుచ్ఛం 17 గులాబీలు, 13 సూర్యకాంత పుష్పాలు, 9 కలువలతో తయారైనది. పూల ధరలు: గులాబీ రూ. 2, సూర్యకాంత పుష్పం రూ. 3, కలువ పువ్వు రూ. 4. వార్షికోత్సవంలో కలుసుకున్న ఉపాధ్యాయుల, అతిథుల వివరాలు: ప్రిన్సిపాల్, ఇద్దరు వైస్ ప్రిన్సిపాల్స్, ఒక ముఖ్య అతిథి, ఒక ఛెయిర్ పర్సన్, 62 మంది సెకండరీ స్కూల్ టీచర్స్, 40 మంది ప్రైమరీ స్కూల్ టీచర్స్. మొత్తం పుష్పగుచ్ఛాలకు అయ్యే ఖర్చులో 10 శాతం తగ్గింపు ఇస్తానని పూలవ్యాపారి ఒప్పుకున్నాడు. వ్యాపారికి ఎంత డబ్బు చెల్లించాలి? ఈ లెక్కను అత్యంత వేగంగా లెక్కగట్టడానికి ఉపయోగపడే వేగసూత్రం ఏమిటి?

మీ వేగసూత్రాన్ని సెప్టెంబర్30వ తేదీ లోగా మాకు రాసి పంపండి. అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ. 500. విజేతలు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్కరికి రూ. 100/- ఇవ్వబడుతుంది.

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:

ఎడిటర్, చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్,
సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్-600041.
లేదా contests@chandamama.com కు ఈ మెయిల్ చేయండి.

*గమనిక: ఈ సమస్యకు వేగవంతమైన వేదగణిత సూత్రం నవంబర్ సంచికలో ప్రచురించబడుతుంది.*

---

జూలై నెల సమస్యకు సరైన సమాధానాలు రాలేదు కనుక బహుమతి ఇవ్వలేక పోతున్నాము.

ఇదీ సరైన సమాధానం:

మొత్తం విద్యార్థుల సంఖ్య = 107

ఒక విద్యార్థికి వారానికి అయ్యే ఖర్చు = రూ. 107

**స్టెప్ 1:** సంఖ్యను అలాగే రాసుకుని; వందకూ, సంఖ్యకూ మధ్య ఉన్న తేడాను దాంతో కూడుకోండి. అంటే 107+(107-100)=107+7=114 ఇది మీ సమాధానంలో ఎడమ చేతి వైపు రాసుకోండి.

**స్టెప్ 2:** 107లో కుడివైపున ఉన్న రెండంకెల సంఖ్యను వర్గం చేయండి. $(07)^2=49$. ఇప్పుడు 49ని సమాధానంలో కుడిచేతి వైపు రాసుకోండి. ఇప్పుడు మీ సమాధానం 11449 వస్తుంది. ఇది 107 వర్గం అన్నమాట.

సమస్య 30 రోజుల మొత్తాన్ని ప్రత్యేకంగా లెక్కగట్టమంటోంది.

107 మందికి ఒక వారానికి అయ్యే ఖర్చు
= 11449/7

107 మందికి 30 రోజులకు అయ్యే ఖర్చు
=(11449/7)X30
=1635.6X30
=16356X3 =49068

# మీ సొంత హోవర్ క్రాఫ్ట్ తయారుచేసుకోండి




ఏమేం కావాలి?

- ఒక బెలూన్
- ఒక పాత సీడీ
- ప్లాస్టిక్ బాటిల్ నుంచి పాప్-టాప్ క్యాప్
- దృఢమైన జిగురు(ఫెవిక్విక్ లాంటిది).

తయారు చేయడం ఎలా?

- పాప్‌టాప్ క్యాప్‌ను తీసుకుని సీడీ మధ్యలో రంధ్రం చుట్టూ జిగురుతో అతికించండి. పూర్తిగా ఎండనివ్వండి.
- సీడీకి అతికించడానికి ముందే పాప్-టాప్ క్యాప్‌ను మూసేయండి.
- క్యాప్ మీద బెలూన్ మెడ భాగాన్ని తగిలించండి.
- బెలూన్ను బాగా ఊది, బెలూన్ మూతిని లాగి క్యాప్ మీదుగా బెలూన్‌ను పెద్దది చేయవచ్చు.
- ఇప్పుడు ఈ హోవర్ క్రాఫ్ట్‌ను నున్నటి నేల మీద ఉంచండి. అలా ఉంచగానే అది నేలమీద జారడం మీరు గమనించవచ్చు.
- నేల మరీ నునుపుగా ఉన్నప్పుడే హోవర్ క్రాఫ్ట్ ముందుకూ వెనక్కూ జరగగలదన్న విషయం గుర్తుంచుకోండి.

  ఏ నేలమీద బాగా పనిచేస్తుందో కనుగొనండి!

కాన్సెప్ట్: నునుపైన నేలమీద ఎయిర్ కుషన్ హోవరింగ్ ద్వారా ముందుకు జరిగే వెహికల్‌ను హోవర్‌క్రాఫ్ట్ అంటారు. అందుకే దీన్ని ''ఎయిర్ కుషన్ వెహికల్(ఎసివి)'' అని కూడా పిలుస్తారు. వెహికల్ అడుగున చిక్కుకుపోయిన గాలిలో హోవర్‌క్రాఫ్ట్ చలనం సృష్టిస్తుంది. ఈ వాయు ప్రవాహాలు నున్నటి ప్రదేశం మీద ఎయిర్ కుషన్స్‌ను సృష్టిస్తాయి. అందువల్ల వెహికల్ మృదువుగా జరుగుతుంది.

# చందమామ లోకజ్ఞానం క్విజ్-8

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. **250**లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు **50** రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే:

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - **8** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. సెప్టెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. అక్టోబర్ నెల సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## భాషలు



1. మన దేశంలోని ప్రాచీన భాషలు ఏవి?
2. బౌద్ధులు, జైనులు ఏ భాషలో తమ మత గ్రంథాల రచన చేశారు?
3. పాకిస్థాన్ జాతీయ భాష ఏది?
4. రవీంద్రనాథ్ టాగూర్ గీతాంజలిని ఏ భాషలో రచించాడు?
5. భాష శాస్త్రీయ అధ్యయనాన్ని ఏమని పిలుస్తారు?
6. ప్రపంచంలో అత్యధికంగా మాట్లాడబడే భాష ఏది?
7. భారత రాజ్యాంగం సాధికారంగా ఎన్ని భాషలను గుర్తించింది?
8. బెంగాలీభాషలో జాతీయగీతం గల రెండు దేశాలు ఏవి?



తన చుట్టూ తాను తిరగని గ్రహం.. వివరాలకు telugu.chandamama.com చూడండి

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు
ఒక్కమాటలోగాని,
చిన్న వాక్యంలోగాని
వ్యాఖ్యలు
రాయగలరా?
రెండు వ్యాఖ్యలకూ
సంబంధం
ఉండాలి.



S. BALASUBRAMANIAN



S. BALASUBRAMANIAN



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు నవంబర్ 2009 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100/- బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్,
**2/513,** సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ **-600 041**

## అభినందనలు

బి. రాజన్న,
బ్లాక్ 10, ఫ్లాట్ 12,
ఎంఐజి హెచ్.బి.ఫ్లాట్స్,
భాగ్‌లింగంపల్లి,
హైదరాబాద్-500 044.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





కోరిక తీరాలంటే కొంతకాలం ఆగాలి!
గమ్యం చేరాలంటే కొంతదూరం సాగాలి!!

## చందమామ లోకజ్ఞానం క్విజ్-6 జూలై 2009 సమాధానాలు

1. రాజా హరిశ్చంద్ర 1913, దాదా సాహెబ్ ఫాల్కే 2. కిసాన్ కన్య 3. ఆలమ్ ఆరా
4. చోటా చేతన్ 5. భాను అతాయ్యా 6. జద్దన్ బాయి 7. మమ్ముటీ 8. ఇంద్రసభ, 71

విజేతకు అభినందనలు:
ఎల్.భానుప్రసాద్, శివాజి నగర్, నారాయణగూడ, హైదరాబాదు-500029.





# యుద్ధసన్నాహాలు

*[ గువ్వా నెమ్మదిగా నిట్టూర్చింది. అది జీబ్రాలాగా కనిపిస్తున్నది. కాని నేనామాట చెప్పడానికి సాహసించలేదు. లెమన్ తన ముక్కుతో నా చొక్కాను తాకి, ''అనునిర్వకు స్వాగతం!'' అన్నది మృదువుగా. ''మనం దాదాపు గమ్యం చేరుకున్నాం!'' అని ప్రకటించాడు ఓమెన్.]*

ఏదో పెళ్ళికి వెళుతున్నంత మామూలుగా ఎదురుచూస్తున్నాను. హంగామా అంటే నాకెందుకో గిట్టదు. ఈ గందరగోళం అంతా ముగిశాక ఎవరో మమ్మల్ని చంపబోతారు. అంతే కదా! అయితే, తాతయ్య మాత్రం తాజ్‌మహల్‌ను చూసినంత సంబరంతో ప్రకృతి అందాలను ఆబగా ఆస్వాదిస్తున్నాడు.

''దాని చెవులు చూడు! ఎంత హుందాగా కదులుతున్నాయో! ''అన్నాడు చీనా ఏనుగును చూపుతూ. వాటిని చూడగానే మహాభారతం టీవీ సీరియల్లో ఇద్దరు స్త్రీలు, ధృతరాష్ట్రుడికి ఇరు వైపులా నిలబడి వింజామరలు వీచే దృశ్యం నా మనసులో కదలాడింది. ఫక్కున నవ్వాను. లడ్డూ తోక విపరీతంగా ఆడిస్తూ నాకేసి చూడసాగింది. మరో కొత్త చోటికి వెళతామనీ, అక్కడ తినడానికి కొత్తకొత్త పదార్థాలు దొరుకుతాయనీ అది ఉత్సాహంగా ఎదురు చూస్తున్నట్టున్నది.

లెమన్, ఓమెన్ గువ్వాతో ఏదో తీవ్రంగా చర్చిస్తున్నారు. ముగ్గురూ మా వైపు చూశారు.

''ఓడ అడుగు పలకను తొలగించేందుకు సమయం సమీపించింది. క్వగ్గా అంతకు ముందుగా వెళ్ళి మిమ్మల్ని భూగర్భానికి తీసుకువెళ్ళడం గురించి జలమానవులతో మాట్లాడి ఒప్పించి వస్తుంది. జలగర్భంలో జలమానవులు మనుషుల్లాగే ఉన్నా అంత హీనులు కారు,'' అన్నాడు ఓమెన్.

నేను తల ఊపాను. తాతయ్య చిన్నగా నవ్వాడు. గువ్వా ఓడలో జలగర్భం అని రాసి ఉన్న గదిలోకి వెళ్ళి రబ్బర్‌బబుల్‌లాంటిమాస్కుతో తిరిగి వచ్చింది. దాన్ని మూతికి బిగించుకుని సకిలించింది. ''ఇంకా



ఎంతసేపు!'' అంటూ చాకులా నీళ్ళలోకి దూకేసింది. ''జలగర్భాన్ని, భూగర్భాన్ని మన వైపు తిప్పుకుంటే, భూమి ఉపరితలంపై నుంచి వచ్చే దాడిని ఎదుర్కోవడం అంత కష్ట మేమీ కాదు,'' అన్నది లెమన్.

గువ్వా ఎప్పుడెప్పుడు నీళ్ళపైకి వస్తుందా అని మేము మౌనంగా ఎదురుచూడసాగాం. గంటల సమయం బరువుగా గడిచినట్ట యింది. గువ్వా నీళ్ళ నుంచి తలపైకెత్తింది. లెమన్ వెంటనే ఒక రబ్బర్ ట్యూబును దాని కేసి విసిరింది. ట్యూబు ఓడకేసి బలమైన తాళ్ళతో కట్టబడి ఉన్నది. మేమందరం కలిసి దాన్ని పైకి లాగాం.

''జలమానవులను ఒక విధంగా ఒప్పించ గలిగాను...'' అన్నది గువ్వా.

నా మనసెంతో తేలికపడింది. సంతోషంగా ఒక అడుగు ముందుకు వేసి చిన్నగా నవ్వుతూ తాతయ్య కేసి తిరిగి చూశాను. అయితే అతడు గువ్వాకేసి తీవ్రంగా చూస్తూ,'' ఏం జరిగిందేమిటి?'' అని అడిగాడు గంభీరంగా.

''మనం ఒకరిని వాళ్ళకు అప్పగించాలి. ఎందుకంటే జలమానవులు మరీ అనుమా నపు ప్రాణులు. తమ పరిధిలోకి అడుగు పెట్టిన మనుషులు తమను పట్టుకోరనే గట్టి నమ్మకం వాళ్ళకు కలిగించాలి. అందుకని మీలో ఒకరు..'' అంటూ గువ్వా, తాతయ్యకేసి, నాకేసి చూస్తూ, ''యుద్ధం ముగిసేంత వరకు మీలో ఒకరు వాళ్ళ దగ్గరే ఉండాలి,'' అన్నది.

నా నెత్తురు చల్లబడింది. జలమానవులు అంటే ఆ క్షణంలో చేపల్లా అనిపించారు.



వాళ్ళ సాహచర్యంలో కొంతసేపు కూడా గడ పడం నాకు ఏమాత్రం ఇష్టం లేదు. పైగా, మేము వాళ్ళకు ఎలాంటి హానీ తలపెట్టలే దని తెలిసినా వాళ్ళు మమ్మల్ని వదిలి పెడ తారన్న నమ్మకం ఏమిటి? అయితే, నేను కాదంటే తాతయ్యను పంపక తప్పదు. అందు వల్ల, ''నేనే వెళతాను,'' అన్నాను ధైర్యం ధ్వనించేలా. తాతయ్య సాలోచనగా గడ్డం తడువుకుంటూ, ''నేనలా భావించడం లేదు. నేనే వాళ్ళతో ఉంటాను. తోడుగా లడ్డూ ఉంటుంది. నువ్వు వెళ్ళు,'' అన్నాడు.

నేనాయనకు నచ్చజెప్పడానికి ప్రయత్నిం చాను. కాని ఆయన నా మాట వినిపించుకో లేదు. తాతయ్య ఒక నిర్ణయానికి వస్తే దాన్ని మార్చడం సాధ్యం కాదు. గువ్వా ఒకసారి ఆయన దృఢమైన చూపులకేసి చూసి, మాకు

మీ మనసులోని మాట చెప్పండి!
చందమామలో మీకు ఏవంటే
ఎక్కువ ఇష్టం?
a) కథలు b) కార్యకలాపాలు c) రెండూ
మీ సమాధానాన్ని RYC <space>
<a\b\c> 5 4 6 4 6కు SMS చెయ్యండి.
జూలై'09 ఫలితాలు:
a: 21%; b: 10%; c. 69%

మాస్కులు తీసుకురావడానికి మళ్ళీ గదిలోకి వెళ్ళింది. మాస్కు పెట్టుకోవడానికి లడ్డూ నానాగొడవ చేసింది. అదో కొత్త రకం రబ్బరు బొమ్మ అనీ, కావాలంటే దాన్ని కొరుక్కుతిన వచ్చనీ దానికి నచ్చచెప్పవలసి వచ్చింది. తాతయ్య తన శక్తిసామర్థ్యాలన్నిటినీ ఉప యోగించి దానికి మాస్కుతొడిగాడు.

ఆఖరికి ఓమెన్ ఓడకు కుడివైపున మధ్యలో అమర్చబడ్డ ఏడు ఊచల వింత ఇత్తడి చక్రం వద్దకు వెళ్ళి దాన్ని తిప్పసాగాడు. కొంతసేపు ఏమీ జరగలేదు. ఆ తరవాత మాయాజా లంలా ఆకాశం నుంచి ఓడమీద నిశ్శబ్దంగా వాన కురవనారంభించింది. నేను చుట్టుపక్కల కలయజూశాను. సముద్రం ఎప్పటిలాగే ప్రశాంతంగా ఉన్నది. ''అదిగో చూడు!'' అంటూ తాతయ్య కిందికి చూపాడు. సూదు ల్లాంటి వర్షపు చినుకులు చదునైన కింది పలకమీద చిల్లులు పొడవసాగాయి. ఓడ బండరాయిలా నీళ్ళలోకి మునగసాగింది. మేము మా స్థానాల నుంచి అటూ ఇటూ కద లకుండా కిందికి దిగసాగాము. నిమిషాల్లో ఓడ జలగర్భంలోని నేలను చేరుకున్నది.



మేము భూమి మీద నడిచినట్టే ఓడలోనూ, బయటా నడవ గలుగుతున్నాం. మా ముఖా లకు పెట్టుకున్న మాస్కులు ఊపిరి పీల్చడా నికి మాత్రమే కాకుండా, నీళ్ళలో ఎలాంటి ఇబ్బందులు లేకుండా తిరగడానికి కూడా ఉపయోగపడుతున్నాయి. ఆ అనుభవాన్ని ఆస్వాదించలేకపోయింది ఒక్క లడ్డూ మాత్రమే. ఎలాంటి ముందు హెచ్చరికా లేకుండా స్నానం చేయించినట్టు కావ డంతో దానికి వెగటు పుట్టిస్తోంది!

నీళ్ళ లోపల సంభాషణ కూడా చాలా వింతగా తోచింది. నోటి నుంచి వెలువడే శబ్దాలను తొడు గులు దూరానికి పయనించేలా చేయగలిగాయి. ఉన్నట్టుండి మాట్లా డినవారి నోళ్ళ నుంచి పెద్దపెద్ద అలలు వెలువడసాగాయి. ఏం మాట్లాడుతున్నదీ

ఒక్కరికీ అంతుబట్టలేదు. ''సాంకేతికలోపం!'' అంటూ లెమన్ ఒక పెద్ద అలను నా ముఖం మీదుగా పంపింది. సీ అనిమోన్లకేసి ఉద్వేగంగా తొండం ఊపుతూన్న చీనా ఏనుగు పక్కనే గువ్వా ప్రశాంతంగా ఈదుతున్నది.

హఠాత్తుగా, ఒక జత చేతులు పెద్ద పెద్ద పగడాల దిబ్బల వెనక కనిపించాయి. నాలో నెత్తురు గడ్డ కట్టినట్టయింది. వాళ్ళు వస్తున్నారు. ఎలాంటి అలికిడీ లేకుండా ఒక్కొక్కరుగా వస్తూన్న వాళ్ళు, ముగ్గురు ముగ్గురుగా జట్లు కడుతున్నారు. వాళ్ళు మాకేసి కళ్ళార్పకుండా చూస్తున్నారు. వాళ్ళ పెద్ద పెద్ద తెల్లటి కళ్ళు రంగులు మారడం గమనించాను. ఒక్కొక్కసారి నీలం రంగుగానూ, మరోసారి ఆకుపచ్చ రంగులోనూ, ఇంకోసారి నారింజ రంగులోనూ కనిపిస్తున్నాయి. వాటిలో ఎలాంటి భావమూ కనిపించలేదు. నడుము వరకు వేళ్ళాడే శిరోజాలున్నాయి. వాళ్ళ కింది శరీరాలు చేపల్లా ఉన్నాయి. శరీరం మీది పొలుసులు అద్దాల్లా మెరుస్తున్నాయి. తోకలు నీళ్ళల్లో అటూ ఇటూ సుతారంగా కదులుతున్నాయి.

తాతయ్య లడ్డూను చేతులతో రొమ్ముకు అదిమిపట్టుకుని జలమానవులకేసి వెళ్ళబోయాడు. కాని ఒక డైనోజార్ సోదరి ఆయన్ను ఆపింది. గువ్వా ముందుగా వెళ్ళి వంగి నమస్కరించింది. ఒక్కసారిగా జలమానవులందరూ చేతులెత్తి తమ చేతులను పువ్వుల్లా తెరిచారు.

జలమానవుల్లో ఒకడు మెడలో గవ్వల దండ వేసుకుని ఉండడం గమనించాను. అతడు అడుగు ముందుకు వేసి మృదువైన



సంగీతంలాంటి కంఠస్వరంతో, ''మేము మానవులకు సాయపడడానికి అంగీకరిస్తున్నాం. వాళ్ళకు హాని తలపెట్టకూడదని ఒకరు చెప్పారు. జలమానవులకు మనుషుల పట్ల ఎలాంటి శత్రుభావమూ లేదు. వాళ్ళు రావడానికి చాలా కాలం ముందే మేము వెళ్ళిపోయాం. వాళ్ళు మళ్ళీ రావడానికి ముందు అక్కడే ఉంటాం,'' అన్నాడు.

మరొకడు ఇలా అన్నాడు: ''మనుషులు నమ్మదగిన వారు కారని అనునిర్వలో కొందరు చెప్పగా విన్నాం. చూసిన దానినల్లా సొంతం చేసుకోవడానికి ప్రయత్నిస్తారు. ఈ సముద్ర గర్భం మీది కాబోదు. మేము దాడిని ఎదుర్కోదలచలేదు. అందువల్ల ఒక మనిషి మా వద్ద ఇక్కడే ఉండాలి. మరొకరు సముద్ర ప్రవేశ ద్వారం గుండా భూగర్భంలోకి వెళ్ళి ఒకరిని కలుసుకోవచ్చు.''

గువ్వా తాతయ్యకేసి చూసింది. ఆయన దాని దగ్గరికి వెళ్ళగానే, ''మేము మీ దగ్గర

వదిలి వెళ్ళ దలచిన మనిషి,'' అన్నది.

గవ్వలదండ వేసుకున్న జలమానవుడు లడ్డూ కేసి చూపుతూ, ''ఇదేమిటి?'' అని అడిగాడు. తాతయ్య పట్టు నుంచి తప్పించుకుని కిందికి దూకడానికి లడ్డూ తన్నుకుంటోంది. కొత్త కొత్త ప్రాంతాలను చూడాలన్న కుతూహలం. ''ఇది నా కుక్క!'' అన్నాడు తాతయ్య నెమ్మదిగా. ఒక చిన్న నీటిబుడగ జలమానవుడి కళ్ళ వరకు వెళ్ళింది. అతడు కళ్ళార్పాడు.

''అదెందుకు ఇక్కడున్నది? మీ జాతి అంతరించి పోతున్నదని చెప్పడం వల్ల, మీ మనుషులను మాత్రమే అనుమతించడానికి అంగీకరించాం,'' అని మరో కంఠస్వరం వెనక నుంచి వినిపించింది. జలమానవుల్లో గుసగుసలు ఆరంభమయ్యాయి. వాటి శబ్దాలు వింటూంటే తేనెపట్టు లోపల కూర్చున్న అనుభూతి కలిగింది నాకు. లెమన్ గాఢంగా నిట్టూర్చి, ''ఇతర ప్రాణుల విలువ తెలియని వారు మనుషులు; అందుకే, మానవులు నమ్మదగిన వారు కారన్నదే కదా మీ వాదం? ఇక్కడ చూడండి. ఒక మానవుడు తనకన్నా తక్కువ అయిన ఒక ప్రాణిని ప్రేమిస్తూ, దాని కోసం తన ప్రాణాలను సైతం పణంగా పెడుతున్నాడు,'' అన్నది. దాని నోటి నుంచి లేచిన పెద్ద అల చుట్టు పక్కల వ్యాపించింది. జలమానవులు ఒక్క అడుగు వెనక్కు వేశారు.



''దీనిని గురించి ఆలోచించడానికి మాకు మరికొంత సమయం కావాలి,'' అన్నాడు గవ్వలదండ జలమానవుడు. అతడి కళ్ళు వేగవేగంగా వివిధ రంగులు తిరుగుతున్నాయి. పాలిపోయిన అతడి ముఖంలో ఆ ఒక్క భావోద్వేగాన్ని మాత్రమే చూడగలిగాను. అతడు మధ్యకు తేలుతూ వెళ్ళి, ఒక చేతిని పైకెత్తాడు. వెంటనే తక్కిన జలమానవులు అతడి చుట్టూ చేరారు. నీళ్ళు కదలబారాయి. అవి మమ్మల్ని కాస్త మెల్లగా వెనక్కు నెట్టాయి. అదో వింత అనుభవం.

ఆ తరవాత కొంత సేపటికి గవ్వలదండ ధరించిన జలమానవుడు గుంపు నుంచి ముందుకు వచ్చి, ''ఈ మనిషినీ, మానవేతర ప్రాణినీ మాతో ఉండడానికి అనుమతించాలని నిర్ణయించాం. తక్కినవారు వెళ్ళిపోవచ్చు,'' అన్నాడు.

చీనా ఏనుగు తొండమెత్తి ఘీంకరించడంతో సముద్రంలో మినీ సునామీ వచ్చినట్టయింది.

అనువుగాని చోటే భావోద్వేగాలను వెలిబుచ్చ డానికి అలవాటుపడిన ప్రాణి అది. నేను గట్టిగా ఊపిరి పీల్చుకుని చేతులూపుతూ తాతయ్యకు వీడ్కోలు చెప్పాను. ఆయన చిన్నగా నవ్వుతూ పిడికిలి బిగించి బొటనవేలు పైకెత్తి చూపాడు.

ఆ తరవాత తాతయ్యనూ, లడ్డూనూ జల మానవులు చుట్టుముట్టారు. తాతయ్య బాగానే ఉన్నాడు కదా అని చూడడానికి వెనక్కు తలతిప్పి చూశాను. కాని జలమాన వుల తోకల మీది తళతళ మెరిసే పొలుసుల నుంచి వెలువడే కాంతుల మిరమిట్లతో నా కళ్ళు ఒక క్షణం కనిపించలేదు.

''వెనక్కు తిరిగి చూడ్డం అంటూ ఉండ కూడదు! అంతే కదా!'' అన్నది చీనా ఏనుగు తాత్విక ధోరణితో. నేను గాఢంగా నిట్టూర్చి ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్న ఓమెన్ దగ్గరికి వెళ్ళి, ''ఇప్పుడేం చెయ్యాలి?'' అని అడిగాను.

''రాబిన్ భూగర్భానికి వెళ్ళి మనం ప్రవే శించడానికి అంతా సవ్యంగా ఉందా అని చూసిరావాలి,'' అన్నాడు ఓమెన్. నేనంత వరకు గందరగోళంగా ప్రవర్తించిన బొద్దింక గురించి పూర్తిగా మరిచేపోయాను. ఎక్కడ ఉందా అని చుట్టుపక్కలా ఆత్రుతగా చూశాను. అది ఒక డైనోజార్ సోదరి పట్టుకున్న జార్ లోపల కనిపించింది..

''అది మాస్క్ పెట్టుకోవడానికి ఒప్పు కోలేదు. అందుకే దాని కోసం ఈ ప్రత్యేకమైన జార్ తయారు చేయవలసి వచ్చింది,'' అన్నాడు ఓమెన్.




''అది ఉండడమే మీకు ఇష్టం లేదను కున్నాను,'' అని అడిగాను ఆశ్చర్యంగా.

''అది ఉపయోగకరంగా ఉండగలదు. అయినా, అది ఇక్కడ ఉంది కదా అని ప్రస్తుతం లోనికి తరమలేం కదా? సవాలక్ష ప్రశ్నలు తలెత్తుతాయి. పైగా, రాబిన్‌కు అను నిర్వ పరిసరాలు అందరికన్నా ఎక్కువగానే తెలుసు. దానికి రహస్య మార్గాలు కూడా తెలుసు గనక, యుద్ధ సమయంలో బోలె డంత సమాచారం తీసుకు రాగలదు,'' అన్నాడు ఓమెన్.

''యుద్ధమా?'' అని అడిగాను నేను.

''మన పొరుగును తినేయడం సహజంగా భావించబడే చోటుకు మనం వెళుతున్నాం నాయనా. అరణ్యానికి స్వాగతం!'' అన్నాడు ఓమెన్.

*-(ఇంకావుంది)*

-సౌమ్యా రాజేంద్రన్

## Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 20% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**

Go to www.chandamama.com or SMS CSHOP to 54646 & we'll get in touch with you!

Subscribe Now!!



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ......................................................................

Date of Birth: .............................. Sex :..............................

Address: ......................................................................

......................................................................

......................................................................

.............................................. City: ..............................

State:.............................. Pin:..............................

Telephone:......................................................................

Mobile:......................................................................

Email:......................................................................

Subscription Number 9for renewals):..............................

Gift Subscription to the following address:

......................................................................

......................................................................

......................................................................

......................................................................

Enclosed Cheque/DD* for Rupees..............................

Cheque/DD No ......................................................................

favouring Chandamama India Ltd on..............................

......................................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sundeep Avenue East,
2nd Main Road, Chinna Neelankarai,
Chennai - 600041. Phone: (044) 43992828, Fax: (044) 43992829
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

Annual Subscription Overseas : US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $[illegible] for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# పాతాళదుర్గం - 14



[విరూపుడు నల్లగరుడపక్షి చేత నరవానరాన్ని కింద పడకొట్టించాడు. తరవాత అందరూ తెప్పల మీద పొట్టి రాక్షసుడున్న చోటుకు చేరారు. రాక్షసుడి వెంట ఉన్న స్త్రీ పులిందుడి భార్యకాదని తేలిపోయింది. రాక్షసుడు వాళ్ళను శిథిలదేవాలయంలోకి తీసుకుపోయి, అక్కడ కందకంలో తిరుగుతూన్న పెద్దపెద్ద మొసళ్ళనూ, సర్పాలనూ చూపించాడు. -తరవాత]

ధూమకుడు కందకంలోని మొసళ్ళనూ, సర్పాలనూ కొంచెం సేపు పరీక్షగా చూశాడు. అతడికొక అనుమానం కలిగింది. శిథిల దేవాలయం ఆవరణలోని చెట్ల మీదున్న మృగాల్లాగే, ఇవీ మహాకలి రాక్షసుడి బంట్ల పెంపుడు జంతువులు కావు గదా? పైగా, పొట్టిరాక్షసుడన్నట్లు, పాతాళదుర్గానికి పోవాలంటే ఉన్న ఒకే ఒక మార్గం ఇదెలా అవుతుంది?

ధూమకుడు ఇలా ఆలోచించి, ఒక నిశ్చితానికి వచ్చి, పొట్టిరాక్షసుడికేసి గుచ్చి గుచ్చి చూస్తూ, ''పాతాళదుర్గాన్ని చేరేందుకు, ఈ కందకంలో ఉన్న జంతువుల మధ్యగా వెళ్ళవలసి ఉంటుందన్న నీ మాటలు సత్యంలాగే కనబడుతున్నవి. ఆ మార్గం నీకు బాగా పరిచయం అయిందీ అలవాటయిందీ కూడా గనక, నువ్వు ముందుండి దారి తియ్యి. మేం అందరం నీకు వెనకగా వస్తాం,'' అంటూ ఈటె పైకెత్తి, పొట్టిరాక్షసుడు వెనక్కు తిరిగి పారిపోయేందుకు వీలులేకుండా అతడి వెన్నుకు ఆనించాడు. అదే క్షణంలో సోమకుడు బాణాన్ని రాక్షసుడి తలకు గురిచేశాడు.

పొట్టిరాక్షసుడు, ధూమక సోమకులకేసి భయపడుతూ చూసి, ''మీరు మాట తప్పుతున్నారు. నాతో ఎలాంటి శత్రుత్వం లేదన్నారు



గదా? ఇప్పుడు ఈటే, బాణం నామీద ప్రయోగించి, నన్నెందుకు చంపాలని చూస్తున్నారు?'' అని అడిగాడు.

''నా మొగుణ్ణి చంపకండి. పుటక్కి రాక్షసుడైనా మనుషుల్లో కూడా ఇంతకన్న మంచి వాడూ, నమ్మకస్తుడూ ఉండడు. దయ తలచి నా మాట నమ్మండి,'' అంటూ పొట్టిరాక్షసుడి ఆటవిక భార్య ధూమక సోమకుల్ని బతిమాల సాగింది.

''నీ మొగుడి మంచితనం ఇదేనా? మేం పాతాళదుర్గానికి మార్గం చెప్పమంటే, మమ్మల్ని ఈ క్రూరజంతువులున్న కందకంలో దిగి పొమ్మంటున్నాడు! అందుకే ముందతణ్ణి దిగి దారి చూపెట్టమన్నాను. ద్రోహానికి ద్రోహమే ప్రతీకారం!'' అన్నాడు ధూమకుడు.

పొట్టిరాక్షసుడు ఒక చిన్న కేక పెట్టి, ''నీ ఈటె సూదికన్నా వాడిగా ఉన్నట్టుంది, అంత గట్టిగా గుచ్చకు. నీ తోటి మానవస్త్రీ చెప్పే మాట ఎందుకు నమ్మవు? నేను దుర్మార్గుణ్ణయితే, ఆ మహాకలి రాక్షసుడి సేవలోనే ఉండి, నీబోటి వాళ్ళను కాల్చుకుతింటూ హాయిగా బతికేవాణ్ణి. సరే, మీ అందరికీ కావలసింది పాతాళదుర్గానికి పోయే దారేకదా? ముందే చెప్పాను, మీలో ఏ ఒక్కరూ అక్కణ్ణించి తిరిగి రాలేరు. మీ ఖర్మకు నేనేం చేసేది!'' అంటూ కందకం గోడ మీద గాలికి రాసుకుంటున్న చెట్లకొమ్మల్లోంచి ఒక బలమైన తాటి మోకును వెతికి బయటికి లాగాడు.

''మహాకలి రాక్షసుడి ముఖ్య సేవకులు కొద్దిమందికి మాత్రమే, ఈ రహస్యం తెలుసు. ఈ మోకు ఆధారంతో కందకంలోకి – ఆ బయిటికి పొడుచుకొచ్చిన రాయి వరకూ దిగి, ఆ రాయిని కాలితో బలంగా నొక్కితే, లోపలి నుంచి ఒక వెడల్పాటి రాతిపలక ముందుకొస్తుంది. దాని మీదికి మీరందరూ నిర్భయంగా దిగొచ్చు. ఆ రాతిపలక బయటపడే చోట ఒక సొరంగ మార్గం ఉంటుంది. దాని వెంట పోతే, మీరు మహాకలి రాక్షసుడు అధికారం చెలాయించే దండకారణ్య ప్రాంతం చేరుతారు. అక్కడ పాతాళదుర్గం కనుక్కోవటం ఏమంత కష్టం కాదు. మీలో ఎవరు ముందుగా ఈ మోకు పట్టుకుని కందకంలోకి దిగుతారు?'' అని అడిగాడు పొట్టిరాక్షసుడు.

ధూమకుడికి ఇందులో ఏదైనా మోసం ఉండవచ్చునన్న అనుమానం కలిగింది.

రాక్షసుడు చెప్పినట్టు ఆ మోకుతో కందకం గోడలో ఉన్న సొరంగ మార్గం చేరినా, ఆ దారి తమను దండకారణ్య ప్రాంతం చేరుస్తుందన్న నమ్మకం ఏముంది? మోకు మధ్యలోనే తెగటం జరిగితే, దాన్ని పట్టుకుని కందకం లోకి దిగేవాడు మొసళ్ళ నోళ్ళల్లో పడిపోతాడు!

ధూమకుడు, రాక్షసుడి చేతిలో ఉన్న తాటి మోకు కేసి చూస్తూ, ఏమో అనబోయేంతలో పులిందుడు పెద్దగా గొంతెత్తి, ''ధూమకదొరా! ఈ బుడంకాయ రాక్షసుడి మాటలు నమ్మకు. వీడు మాయలమారి. ఈ ఆడదాన్ని చూస్తున్న కొందికీ నాకు ఈవిడలో నా పదో పెళ్ళాం పోలికలు కనిపిస్తున్నవి,'' అన్నాడు.

ధూమకుడు, పులిందుడితో మంచిగా, ''పులిందా, నీవింతవరకూ చేసిన సహాయా నికి కృతజ్ఞుణ్ణి. ఇక నువ్వు నీ గూడేనికి తిరిగి పోవచ్చు. నీ తెప్పల్ని కూడా తీసుకుపో. నీ భార్య పాతాళదుర్గంలో మహాకలి చెరలో ఉన్న దనే దాంట్లో సందేహం లేదు. రాజకుమార్తెతో పాటు, ఆమెనూ తప్పక తీసుకువస్తాం,'' అన్నాడు.

ధూమకుడిలా అనగానేపులిందుడు మహా సంతోషపడిపోతూ, ''ధూమకదొరా, మంచి మాట చెప్పావు. పోయింది పోనే పోయింది, ఇక ఉన్న తొమ్మిది మంది భార్యల రక్షణ అయినా చూసుకోవాలి గదా? ఇక నేను నా గూడేనికి తిరిగిపోతాను. పాతాళదుర్గం చేరిన తరవాత, నా పెళ్ళాం సంగతి మర్చిపోయేరు సుమా?'' అంటూ కందకం దగ్గిర నుంచి బయలుదేరి నది కేసి నడిచాడు.



ధూమకుడు నెత్తిమీది నుంచి పెద్ద భారం దిగిపోయినట్టు ఒక నిట్టూర్పు విడిచాడు. పొట్టిరాక్షసుడు చటుక్కున మోకు పట్టుకుని జర్రున కందకంలోకి జారి, దాని గోడలో ఉన్న ఒక రాతిని కాలితో గట్టిగా నొక్కాడు. మరు క్షణం ఒక పెద్ద రాతి పలక బయటి కొచ్చింది. రాక్షసుడు దానిమీది కెక్కి నిలబడి, ధూమ కుడూ వాళ్ళతో, ''చూశారు గదా? ఇందులో మోసం ఏమీలేదు. కింద ఉన్న విషజంతు వులు ఇంత ఎత్తు ఎగరలేవు. ఇక అంతా మోకు పట్టుకుని దిగిరండి,'' అన్నాడు.

అప్పటికి ధూమకుడి సంశయాల్లో కొన్ని నివారణ అయినై. అందరూ రాతిపలక పైకి దిగారు. అక్కడ వారికి మెట్లున్న ఒక సొరంగ మార్గం కనిపించింది.



అతడే మా రాజకుమార్తె కాంతిసేనను దొంగిలించుకుపోయింది,'' అన్నాడు.

''అతణ్ణెరక్కేం? మాంత్రికుడొకడు వాడి కొమ్ము విరగ్గొట్టాడు. వాళ్ళిద్దరూ హోరాహోరి పోట్లాడారట. ఆ మాంత్రికుడుండేదీ దండకారణ్యంలోనే. మహాకలికీ వాడికీ బద్ధవైరం,'' అన్నాడు పొట్టిరాక్షసుడు.

అంతలో కందకం పైనుంచి రాక్షసుడి భార్య, ''నువ్వు కూడా వాళ్ళతో పడి మీ ఊరు పోదామనుకుంటున్నావా? పైకి రావేం!'' అంటూ కళ్ళెర్ర చేసి కేక పెట్టింది. రాక్షసుడు గతుక్కుమని, ''ఈ గయ్యాళెప్పుడో నాగొంతు కురెడుతుంది!'' అని ధూమకుడి చేతులు పట్టుకుని, ''నా సంగతి దండకారణ్యంలో నర రాక్షసులెవరికీ చెప్పకండి, సరేనా?'' అంటూ మోకు పట్టుకుని గబగబా కందకం గోడపైకి పాకిపోయాడు.

విరూపుడూ, సోమకుడూ రాతిపలక మీంచి సొరంగమార్గపు మెట్లకేసి పోబోయేంతలో ధూమకుడు వాళ్ళను వారించి, ''మనం సొరంగమార్గాన దాదాపు గంట ప్రయాణం చేయవలసి ఉంటుంది గదా, వెలుగు లేకపోతే అదెలా సాధ్యం? రాక్షసబ్బంట్లు ఈ మార్గానే పాతాళదుర్గానికి వెళ్ళే మాట నిజమైతే, వాళ్ళు ఉపయోగించే దివిటీలు మెట్ల దగ్గిర ఎక్కడో ఉంటవి, ముందు ఒకళ్ళు వెళ్ళి వెతకండి,'' అన్నాడు.

సోమకుడు సొరంగంలోకి పోయి ఒకటి రెండు నిమిషాల తరవాత మూడు నాలుగు దివిటీలూ, అవి వెలిగించేందుకు ఉపయో

''ఈ సొరంగ మార్గం ద్వారా మీరొక గంట ప్రయాణంలో దండకారణ్యం చేరగలరు. ఇదే ప్రయాణం, ఆ కనబడే కొండదారుల వెంట అయితే నాలుగైదు నెలల కాలం పట్టవచ్చు. మార్గంలో మీరు అనేక కష్టాలను ఎదుర్కోవలసి రావటమే గాక, దారి తప్పి బయలుదేరిన చోటుకే తిరిగి వచ్చే ప్రమాదం కూడా ఉంటుంది,'' అన్నాడు పొట్టిరాక్షసుడు.

ధూమకుడు, సోమకుడికేసీ విరూపుడికేసీ చూశాడు. ఆ ఇద్దరూ సొరంగమార్గంలో ప్రవేశించటానికి సిద్ధమన్నట్టు నిలబడ్డారు. ధూమకుడు, పొట్టిరాక్షసుడికి కృతజ్ఞత చెప్పి, ''రాక్షసుల్లో కూడా మంచి వాళ్ళుంటారని నిన్ను చూసింతరవాత గట్టి నమ్మకం కలిగింది. కుంభీరుడనే మీ వాణ్ణి ఎరుగుదువా?

గించే చెకుముకి రాయీ, దూదీ తీసుకుని ధూమకుడి దగ్గిరకు వచ్చాడు. ధూమకుడూ, విరూపుడూ రాతిపలక మీంచి సొరంగంలోకి దిగారు. వెంటనే రాతిపలక ఠపీమని సొరంగ మార్గాన్ని మూసేసింది.

ఒకటిరెండు నిమిషాల తరవాత ముగ్గురూ దివిటీలు వెలిగించుకుని సొరంగ మార్గాన బయలుదేరారు. ముఖ్యమార్గం విశాలంగా దారి తప్పటానికి వీలులేకుండా ఉన్నది. కాని, దాని నుంచి అక్కడక్కడా చిన్నచిన్న మార్గాలు కొన్ని పక్కలకు పోతున్నవి. వాటిని పరీక్షించటానికి పోయిన విరూపుడికి, ఒక చోట రెండు మూడు మానవకంకాళాలు కనిపించినై. రాక్షసుడి సేవకుల నుంచి తప్పించుకు పారిపోయేందుకు ప్రయత్నించి, ఆ నిర్భాగ్యులు ఆ ఇరుకు దారిలో చిక్కుకుని మరణించి ఉంటారని విరూపుడు భావించాడు.

ఏ దుస్సంఘటనా లేకుండా ఓ అరగంట కాలం ధూమకుడూ అతడి అనుచరులిద్దరూ సొరంగంలో చాలాదూరం నడిచారు. వాళ్ళు ఒక మలుపు తిరిగేసరికి దూరంగా వాళ్ళకు తమకేసే వస్తున్న దివిటీలు కొన్ని కనిపించినై. ధూమకుడు చప్పున వెనుదిరిగి మలుపు చాటుకు వచ్చి, తన చేతిలోని దివిటీని నేలకు కొట్టి ఆర్పివేస్తూ, సోమకుణ్ణీ, విరూపుణ్ణీ కూడా అలాగే చేయమన్నాడు. తరవాత ముగ్గురూ ప్రధాన సొరంగమార్గం వదిలి, పక్కలనున్న ఒక చిన్నసందులో దాక్కున్నారు.

క్రమంగా దివిటీలు ధూమకుడూ వాళ్ళున్న ప్రాంతానికి వచ్చినై. ఆ దివిటీల వాళ్ళంతా



కలిసి ఇరవై మంది ఉంటారు. అందరికన్నా ముందు ఒక రాక్షసుడు నడుస్తున్నాడు. ఆ తరవాత ఉన్న వాళ్ళంతా మహాకలికి చిక్కి, అతడి సేవలో చేరిన మానవ వ్యక్తులు; అందరికీ వెనకగా మరొక రాక్షసుడు. ముందున్న రాక్షసుడు పెద్ద గొంతుతో ఏదో పాట పాడుతున్నాడు. తతిమ్మావాళ్ళు చిన్న గొంతులతో వంత పాడుతున్నారు. వాళ్ళు ధూమకుడున్న చోటు చేరి, సూటిగా ముందుకు చూస్తూ నడిచిపోసాగారు. అందరూ ఆ ప్రదేశం దాటిన తరవాత, వెనకవున్న రాక్షసుడు ముక్కుపుటాలు ఎగరవేస్తూ, ''ఎక్కడో దివిటీలారిన పొగవాసన వేస్తున్నది,'' అన్నాడు బిగ్గరగా.

ముందు నడుస్తున్న రాక్షసుడు విసుక్కుంటూ, ''ఇన్ని రకాల పొగవాసనలు

## చందమామను ఇంటికి తెప్పించుకోండి!



న్యూస్ పేపర్ వేసే డెలివరీ మ్యాన్ ద్వారా రెగ్యులర్‌గా చందమామను తెప్పించుకోవచ్చు. స్థానిక న్యూస్ స్టాండ్స్ నుంచి, లీడింగ్ బుక్ షాప్స్ నుంచి చందమామను కొనుక్కో వచ్చు. చందా వివరాలకు **www.chandamama.com** లాగాన్ చేయండి. లేదా **CSHOP** అని టైప్ చేసి **54646**కు **SMS** చేయండి.

న్నయ్యా? మన దివిటీల నుంచి వచ్చేదేమన్నా, సాంబ్రాణిపొగా? అతితెలివికి పోక త్వరగా నడిచిరా,'' అని కేక పెట్టాడు. వెనక నడుస్తున్న రాక్షసుడు మారు మాటాడకుండా తతిమ్మా వాళ్ళని అనుసరించిపోయాడు. ధూమకుడూ అతడి స్నేహితులిద్దరూ ప్రాణగండం తప్పి నంతగా సంతోషించారు. దివిటీ రాక్షసబ్బంట్లు సొరంగమార్గం వెంట కంటికి కనబడకుండా పోగానే, ధూమకుడూ వాళ్ళు దాక్కున్నచోటు నుంచి బయిటికి వచ్చి, మళ్ళీ దివిటీలు వెలిగించుకుని ముందుకు పోసాగారు.

పావు గంటకాలం గడిచింది. సొరంగ మార్గం ఇప్పుడు లోగడ ఉన్నంత చీకటిమ యంగా లేదు. ఎక్కడి నుంచో లోనికి వెలుగు ప్రసరిస్తున్నది. ''ఇక, మనం దివిటీలు ఆర్పే యవచ్చు,'' అన్నాడు ధూమకుడు.

వాళ్ళు ముగ్గురూ దివిటీలు ఆర్పి, వాటిని ఒక చోట దాచి, ముందుకు నడిచారు. ఒక మలుపు తిరిగేసరికి సూర్యకాంతి కళ్ళను మిరుమిట్లు కొల్పుతూ సొరంగద్వారం నుంచి లోపలికి పడుతున్నది. ముగ్గురూ వేటాడే పులుల్లా నక్కుతూపోయి సొరంగ ద్వారం చేరేందుకున్న రాతిమెట్లెక్కి, ద్వారం పక్కల నున్న రాళ్ళచోటు నుంచి ముందుకు చూశారు. అక్కడ ఎదురైన దృశ్యం వాళ్ళను నిలువునా కంపింపజేసింది. ఒక మహాకాయుడైన రాక్ష సుడు రంగురంగుల చర్మాలతో కుట్టినదుస్తులు ధరించి, నెత్తిన కిరీటం, చేతిలో పెద్ద ముళ్ళగద పట్టుకుని, ఏనుగులు పూన్చిన రథంలో అరణ్యమార్గాన పోతున్నాడు. అతని రథానికి వెనకగా సాయుధులైన రాక్షసులనేక మంది నడుస్తున్నారు. *-(ఇంకాఉంది)*



## దయ్యాల భోజనశాల



ఈ నవంబర్ నెల నుంచి కోల్‌కతాకు కొన్ని కిలోమీటర్లదూరంలో 6 వ నేషనల్ హైవేపక్కన ఒక వింతైన రెస్టారెంట్ రానున్నది. మిమ్మల్ని అక్కడ అస్థిపంజరాలు ఆహ్వానిస్తే, దయ్యాలు చిరునవ్వుతో ఆర్డర్లు స్వీకరించి వడ్డిస్తే భయ పడకండి. గోడల నుంచి పిశాచాలు వెలువడి మీ పక్కన కూర్చుంటే హడలిపోకండి. అంతా సరదాగా జరిగే ఈ రెస్టారెంట్‌ను సుప్రసిద్ధ ఇంద్రజాలికుడు పి.సి.సర్కార్(జూనియర్) నిర్మిస్తున్నాడు. సమాధులు, పుర్రెలతో నిండిన ప్రాంగ ణంలో గోడలపై పిశాచాల, దయ్యాల చిత్రాలు చిత్రించబడి ఉన్నాయి. మసక చీకట్లో లేజర్ రేస్‌తో, యానిమేటెడ్ మోడల్స్ ద్వారా ఈ విచిత్ర అనుభూతిని కలిగించనున్నారు!

## పాక్రౌవా వివాహం

భిన్నత్వంలో ఏకత్వం సంతరించుకున్న దేశం మనది. కొన్ని ఆచార సంప్రదాయాలను చూస్తే ఇది అక్షరాలా నిజమనిపించకపోదు. వరకట్న దురాచారం ఒక వైపు పీడిస్తున్నప్పటికీ, మరో వైపు అలా కోరే వరుణ్ణి బలవంతంగా తీసుకువచ్చి పెళ్ళి జరిపించే సంప్రదాయం కూడా ఉంటోంది. బీహారులో ఆచరణలో ఉన్న ఈ సంప్రదాయాన్ని ''పాక్రౌవా వివాహ్'' అంటారు.

ఈ సంప్రదాయం ప్రకారం–పెళ్ళికూతురికీ, ఆమె కుటుంబానికీ పెళ్ళికొడుకు నచ్చి, అతడు కోరే వరకట్నం చాలా ఎక్కువ అని తోచినట్ట యితే, సినిమా ఫక్కీలో ఈ పద్ధతిని అను సరించి కార్యం సాధించుకోవచ్చు. కొందరు గూండాలను ఆశ్రయిస్తే, వాళ్ళు హఠాత్తుగా వరుణ్ణి అపహరించి తెచ్చి, పెళ్ళికూతురు వారికి అప్పగించి, పెళ్ళి జరిపిస్తారు. పెళ్ళి కొడుక్కు ఇష్టం లేకపోయినా ఇంత జరిగాక అతగాడు నోరు కదపడానికి లేదు!



# ప్రాణం కన్నా ప్రధానం!

*క్రీ.శ. 1561, మాళ్వరాజ్య మాండూనగరం రేవాకుండ్.*

రాజభవనం చివర ఆమె కూర్చుని ఉన్నది. సాయంసంధ్య సూర్యకిరణాలు నేలపై ప్రసరిస్తూ లోపలి చల్లదనాన్ని పీల్చేస్తున్నాయి. ఆమె చేతులు నునుపైన చలవరాతిని మెల్లగా స్పృశించాయి. ఆమె మృదువైన చేతులు కందిపోకుండా అవి మరింత సున్నితంగా, నునుపుగా మలచబడ్డాయి.

ఆమె కూర్చున్న చోటికి దిగువగా కొద్ది దూరంలో మణిహారంలా నర్మదానది గంభీరంగా ప్రవహిస్తున్నది. సాయంకాల సూర్యుడి బంగారు రంగు కిరణాలు పడగానే అది మరింత శోభాయమానంగా ప్రకాశిస్తోంది. మాండూ ప్రజల సౌభాగ్యదాయిని అయిన ఆ అందమైన నదిని ఆమె రేవా అని పిలిచేది. కోట గోడలకు ఆనుకుని ప్రవహించే ఆ నది అందాలను తిలకిస్తూ, తనలో తాను నవ్వుకుంటూ, రాజభువనంలో ఎంతకాలమని గడుపుతుంది!



దూరం నుంచి ఏవో ఏడ్పులు, అరుపులు వినిపించాయి. అవి నిజంగానే దూరం నుంచి వినిపించాయా? తన భ్రమా? అన్న అనుమానం ఆమెలో కలిగింది. ఇటీవల కొంత కాలంగా వాస్తవానికీ, ఊహకూ మధ్య ఉన్న భేదం ఆమె గ్రహించలేకపోతున్నది. తరచూ గత స్మృతుల లోకి జారిపోతున్నది. నిన్నమొన్న జరిగిన సంఘటనల పర్యవసానమే అది కావచ్చు.

ఎవరో రహస్యంగా ఆమె దగ్గరికి వచ్చారు.

''మహారాణీ!''

మాళ్వరాణి రూపమతి తలపైకెత్తి చూసి విచారంగా నవ్వింది. ఆమె మోము నల్లటి మేఘాల చాటున చందమామలా కనిపించింది. పరిచారిక వంగి నమస్కరించి, అందమైన నగిషీలు చెక్కిన చిన్న పాత్రలో పానీయం అందించింది. రాణి దానిని అందుకుని, అందులోకి సాలోచనగా చూసింది. ఎప్పటిలా ఆమె ఆలోచనలు ఒక్క క్షణం వెనక్కు వెళ్ళాయి. మువ్వల సవ్వడులు, నవ్వులు మదిలో గలగలలాడాయి.

* * *

*క్రీ.శ 1556, మాండూ శివార్లలోని పళ్ళతోట.*

నగరంలోని సైనిక దళాలను తిరిగి చూసిన మియాన్ బయిజద్ జాజ్ బహదూర్ బాగా అలిసిపోయాడు. అవేవీ కూడా ఆయనకు ఉత్సాహం కలిగించేవిగా కనిపించలేదు. మాళ్వ సుల్తానుగా యువకుడైన ఆయన కొన్ని బాధ్యతలను నిర్వహించవలసి ఉన్నది. అయినా అవి ఆయనకు సంతోషాన్ని ఇవ్వడం లేదు. చిన్న రాజ్యాధినేత అయినప్పటికీ నిరాడంబర జీవన విధానమే ఆయనకు నచ్చింది. సంగీతం, సాహిత్యం, కళలు, రుచికరమైన భోజనం, అందమైన వస్త్రాభరణాలు చాలు సుఖ పడడానికి అని భావించేవాడాయన. పాలనా బాధ్యతలను అధికారులకు అప్పగించి, హాయిగా రోజులు గడిపేయాలనుకునే స్వభావం ఆయనది. రాజ్యం సుసంపన్నం కావడంతో ప్రజలు సుఖశాంతులతో జీవించేవారు. అప్పుడప్పుడు ప్రజల బాగోగులను తెలుసుకోవడానికి రాజభవనం వదిలి బయటకు వెళ్ళక తప్పేది కాదు. అలా పొద్దుటి నుంచి తిరిగి చూసిన ఆయన బాగా అలిసిపోయాడు. పైగా ఎండ చుర్రుమంటున్నది. ఆయన స్వారీ చేస్తున్న గుర్రం కూడా బాగా అలసి పోయినట్టు కనిపిస్తున్నది.

...మృదుమధురమైన స్త్రీ కంఠస్వరం పాడే పాట ఆయన వీనులను సోకింది. ఒక్క క్షణం అక్కడే ఆగిపోయాడు.

తనకు తెలిసిన అందమంతా-పరిమళాల గులాబీలు, సువాసనల మల్లెలు, ముత్యాల వెన్నెలలు, పట్టు వస్త్రాల మెత్తదనం-ఒకే చోట రాసిపోసినట్టు అనిపించడంతో తనకు తెలియకుండానే ఆ కోయిల గానం వినిపిస్తున్న దిశ కేసి గుర్రాన్ని మళ్ళించాడు.



*అందానికి అందమా! మానినీ తిలకమా!*
*పరుల కంటబడనీయకు నీదు సుందర రూపం!*
*ప్రాణం కన్నా ప్రధానం మాన సంరక్షణం!*
*మానహాని కన్నా మరణమే నయం! నయం!!*

చిత్తోర్ రాణి పద్మిని విషాదాంత వీరగాథను తెలియజేసే ఆ గీతం ఆయన హృదయాన్ని కదిలించి వేసింది.

మృదు మధురమైన కంఠస్వరం కలిగిన వారు అంత అందంగా ఉండరన్నది ఆయన అభిప్రాయం. అయినా బాజ్ బహదూర్ ఆమెను సత్కరించాలనే నిర్ణయించాడు. మరికొంత ముందుకు వెళ్ళాడు ఆమెను వెతుక్కుంటూ..

మరో ముగ్గురు స్త్రీలతో కలిసి, ఆమె ఒక చెట్టు కింద కూర్చుని పాడుతోంది. పలుచటి దుస్తులు ధరించిన ఆమె మేని గులాబీ రేకుల ఛాయతో తళుకులీనుతున్నది. ఆమె కళ్ళు మిలమిలా మణుల్లా మెరుస్తున్నాయి. ఆమె



మరీ చిన్నది. వాళ్ళు అతణ్ణిసమూలంగా ఓడించారు. అవును వాళ్ళు తప్పక జయిస్తారు, అనుకున్నాడతడు నిర్లిప్తంగా. మాళ్వ సుల్తాను అయిన తను నిరంతరం కళలు, సంగీతం అంటూ వినోదాలతో, విలాసాలతో తలమునకలైపోయి, దురాక్రమణదారుల గురించి పట్టించుకోలేదు. ఆయన అలసత్వానికి ఇప్పుడు రాజ్యం బలి అయింది!

వీనులవిందుగా పాడుతూంటే ఆమె ఎర్రటి పెదవులు మనోహరంగా కదులుతున్నాయి. పాటకు అనుగుణంగా సుతారంగా కదులుతూన్న ఆమె అందమైన చేతులు ఆలపిస్తూన్న కథకు అనిర్వచనీయమైన అందాలను సమకూరుస్తున్నాయి. వాళ్ళ మధ్య ఆమె చుక్కల్లో చందమామలా, దివి నుంచి దిగివచ్చిన దేవతా స్త్రీలా పండ్ల తోటను దేదీప్యమానం చేస్తున్నది!

బాజ్ బహదూర్‌కు ఆమె పేరు తెలియదు. ఊరు తెలియదు. తల్లి దండ్రులెవరో తెలియదు. అయినా, ఆమెను తప్పక వివాహమాడాలని నిర్ణయించాడు.

* * *

*క్రీ.శ. 1561, మార్చ్ 29, మాళ్వ సారంగపూర్ యుద్ధరంగం.*

చెట్ల చాటు నుంచి ఆయన యుద్ధరంగాన్ని పరిశీలించి చూస్తున్నాడు. సైనికుల శవాలు, గుర్రాల, ఏనుగుల కళేబరాలు చిందరవందరగా పడి ఉన్నాయి. అక్బర్ చక్రవర్తి దళపతులు ఆదమ్ ఖాన్, పీర్ మహమ్మద్ ఖాన్ నాయకత్వంలో వచ్చిన సైన్యంతో పోలిస్తే తన సైన్యం

బాజ్ బహదూర్ ప్రియమైన రాణి రూపమతికి కూడా అదే దుర్గతి పట్టనున్నది. ఆమె అందచందాలను గురించి ఆదమ్ ఖాన్ కథలు కథలుగా విని ఉన్నాడని చెప్పుకుంటారు.

అది నిజమే కావచ్చని బాజ్ బహదూర్ బాధతో నిట్టూర్చాడు గాయాలను తుడుచుకుంటూ. వాళ్ళ వివాహం దేశవ్యాప్తంగా సంచలనం సృష్టించింది. విప్లవాత్మకమైనదని కొందరు చెప్పుకున్నారు. పండ్ల తోటలో తారసపడిన అందాల గాయని పేరు రూపమతి అనీ, రాజపుత్ర యువతి అనీ, మాండూలోని గౌరవనీయ కుటుంబానికి చెందినదనీ తెలియవచ్చింది. వివాహానికి ఆమె తల్లిదండ్రులు అంత సుముఖంగా లేకపోయినప్పటికీ రూపమతి బాజ్ మహదూర్‌ను చూడగానే ప్రేమ పెంచుకున్నది.

వాళ్ళు ఎంతో అన్యోన్యంగా సుఖజీవనం సాగించారు. ఆమెను అందరూ సరోజం లాంటిదని ప్రేమతో పిలిచేవారు. ఆమె కోసం అతడు ప్రత్యేకంగా రేవాకుండ్, రాణి భవనాలు నిర్మించాడు. ఆమెకు నర్మదానది అంటే వల్ల

మాలిన ఇష్టం. తన భవనం నుంచి గంటల తర బడి నదిని చూస్తూ అమితానందం పొందేది. వాళ్ళ జీవితం ఆనందమయంగా గడవసాగింది. అయితే, ఇప్పుడు.....

మాళ్వా ఓడిపోయింది. తప్పించుకునే అవ కాశం లేదు: ప్రముఖ వాణిజ్య కేంద్రమైన మాళ్వను మొగలులు వదిలిపెట్టరు. ఒక సుల్తా నుగానే కాదు; మామూలు మనిషిగానూ ఆయన జీవితం చివరి దశను చేరుకున్నది. సాయం కోరి చండీఘడ్‌కు వెళ్ళినా ప్రయోజనం లేకపోయింది. ఓటమి, అవమానం, విషాదం ఆయన ఎదుట వికటాట్టహాసం చేశాయి!

ప్రియమైన రూపమతి! ఇదంతా తెలిస్తే ఏమ నుకుంటుంది? ఆమె ఏం చేస్తుంది? సుల్తానుగా, భర్తగా ఆమెను రక్షించవలసినది తన బాధ్యత! అయినా దానిని నిర్వర్తించలేకపోయాడు...!

ఎప్పుడో విన్న గీతంలోని చివరి రెండు చర ణాలు అసంకల్పితంగా అతడి పెదవులపై కద లాడాయి:

*ప్రాణం కన్నా ప్రధానం మానసంరక్షణం!*
*మానహానికన్నా మరణమే నయం! నయం!!*

✻ ✻ ✻

*క్రీ.శ. 1561, మార్చ్ 30, రేవాకుండ్ మాండూ.*

అరాచక పరిస్థితులు. ఎటు తిరిగినా భయాం దోళనలు. శత్రువు వచ్చేశాడన్న వార్తలు. స్త్రీలు, పురుషులు రోదిస్తూ వీధుల్లో పడ్డారు. సుల్తాను లేడు గనక రక్షణ కరువయింది. రాజభవనాన్ని పరిరక్షించడానికి అక్కడున్న కొద్ది మంది కాపలా భటులు పోరాడారు. అయితే, విజయోత్సా హంతో విరుచుకుపడ్డ మొగలు సైనికుల ధాటికి ఆగలేకపోయారు.

తన భర్త బతికి ఉన్నాడా లేడా అన్నది ఆమెకు తెలియదు. తెలిసినా ఇప్పుడు పెద్దగా ఒరిగే దేమీ లేదు. రూపమతిని పట్టుకోవడానికి ఆదమ్ ఖాన్ వస్తున్నాడు. ఆమె చేతిలోని పానీయం కేసి చూసింది.

''ఇక సెలవు. ఇన్నాళ్ళు నువ్వూ, నేనూ స్నేహంగా ఉన్నాం. వెళ్ళేముందు ఆయన్ను చూడలేక పోయానన్నదే బాధగా ఉంది,'' అంటూ పాత్రలోని విషాన్ని గుటగుటా తాగే సింది. చెలికత్తె భోరున విలపించింది.

రాజభవనం తలుపులు తెరుచుకుని సుడి గాలిలా లోపలికి జొరబడిన ఆదమ్ ఖాన్‌కు రాణి రూపమతి శవం మాత్రమే కనిపించింది. ప్రాణాలతో ఉన్నప్పుడు చూసినట్టే, ఆమె ఇప్పుడూ నర్మదానదిని చూస్తూనే ప్రాణాలు విడిచింది!

-పవిత్రా శ్రీనివాసన్



# కింగ్ ఖానా





## హల్వాకు హలో చెబుదాం



టర్కీలో అతి ప్రాచీనమైన ఫలహారంగా హల్వా ప్రసిద్ధి గాంచింది. ఆహారం, వంటల గురించి విస్తృతంగా రచనలు చేసిన పదమూడవ శతాబ్దానికి చెందిన మౌలానా జలాలుద్దీన్-ఇ-రూమీ రచనలలో ఈ తీపి వంటకం గురించిన ప్రస్తావన ఉంది.

****



రవ్వను ఉడికించి ఉండలు పట్టి టర్కీ దేశస్థులు హల్వాను తయారు చేసేవారు. పంచదార రాక ముందు తీపి కోసం ఉండలను తేనెలో గాని, పెక్మెజ్ అనే ద్రాక్షరసంలో గాని నానబెట్టేవారు.

****



పదిహేనవ శతాబ్దంలో, సుల్తాన్ 'సులేమాన్ ది మేగ్నిఫిషియెంట్' తన టోప్‌కాపీ భవనాన్ని విస్తృతపరచినప్పుడు వంటగదుల పునర్నిర్మాణం చేయాలని ఆదేశించాడు. అక్కడ రకరకాల హల్వాలు తయారు చేయడానికి ప్రత్యేక 'హల్వా సదనం'(హల్వాహనే) నిర్మించాడు!

****



గ్రీకులు ఇటుక ఆకారంలో 'తహిని'తో కూడిన ఒక రకమైన హల్వాను తయారు చేసేవారు. దీనిని 'మెకెడొనికోస్ హల్వా' అని పిలిచేవారు. హల్వాపై నిమ్మరసం, దాల్చినచెక్క చల్లి తినడానికి ఇష్టపడేవారు.

****



తమిళనాడులోని తిరునెల్వేలి 'హల్వా నగరం'గా ప్రసిద్ధి గాంచింది. మూడువందల సంవత్సరాల క్రితం వచ్చి స్థిరపడిన ఒక మార్వాడీ కుటుంబం తయారు చేసిన గోధుమ హల్వా చాలా ప్రాచుర్యం పొందింది.

రాయల చిత్రపటంలో గుర్రపుతోక telugu.chandamama.com కథానాయకులు చదవండి

పదహారవ శతాబ్దంలో మొగలులు హల్వాను భారతదేశానికి పరిచయం చేశారు. తూర్పు దేశాలన్నిటిలోకీ భారతదేశంలోనే క్యారట్‌హల్వా నుంచి గుమ్మడి హల్వా వరకు రకరకాల హల్వాలు తయారు చేస్తారు.



****



పదిహేడవ శతాబ్దంలో, ఇస్తాన్‌బుల్‌లోని విద్యార్థులు 'హల్వా విందులు' అనే సదస్సులు నిర్వహించేవారు. ఈ సమావేశాల్లో చర్చల మధ్య మధ్యలో 'హల్వా'ను వడ్డించేవారు.

****



మనకందరికీ హల్వా అంటే తీపి తినుబండారంగానే తెలుసు. అయితే, ఇరాన్‌లో హల్వాను పర్షియన్ ఫ్లాట్‌బ్రెడ్ లావాష్ మధ్య పెట్టి 'హల్వా శాండ్విచ్'గా తీసుకుంటారు.

****



బల్గేరియాలో 'ప్రోవ్ సండే' సందర్భంగా జరిపే హంకాన్‌లో 'వైట్ హల్వా'ను మత సంబంధమైన తంతులో ఉపయోగిస్తారు. పొడవాటి కర్రకు హల్వా ముక్కలను దారంతో కట్టి వేలాడదీసి తిప్పుతారు. పిల్లలు నోటితో హల్వాను పట్టుకోవడానికి ఉత్సాహంతో ప్రయత్నిస్తారు.

****




'హల్వా' కొన్ని పదబంధాలలోనూ, జాతీయాల్లోనూ చోటు సంపాయించింది. జోస్నియాలో 'ప్రొడాజే సేకావో హల్వా' అంటే 'హల్వాలా అమ్ముడవుతాయి' అని అర్థం. 'అన్టే రే హల్వా' అనే గ్రీకు సామెత ఉంది. 'వెళ్ళిపో హల్వా' అని దాని అర్థం.



మీరు హల్వా అభిమానా? హల్వా షాప్ పెట్టాలనుకుంటున్నారా? ముందుకు వెళ్ళండి... 'ప్రొడాజే సే కావో హల్వా' అన్నది గుర్తుంచుకోండి!



# తీరిన సందేహం!

ఒక సందేహనివృత్తి కోసం మూడు నెలలకు ముందు ఊరు వదిలిన సత్తెయ్య, అడవిమార్గం గుండా వెళుతూ, దారిపక్కన పండు ముదుసలి అయిన ఒక సాధువు స్పృహతప్పి పడి ఉండడం చూశాడు. ఒక్క ఉదుటున వెళ్ళి నీళ్ళు తెచ్చి ఆయన ముఖం మీద చల్లి, మిగిలినవి తాగించాడు. దాపుల నున్న చెట్ల నుంచి పళ్ళు కోసి తెచ్చి ఇచ్చాడు.

పళ్ళు తిని సాధువు కోలుకుని, ''దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు, నాయనా!'' అన్నాడు.

''దేవుడనే వాడు ఎక్కడుంటాడన్న విషయం తెలుసుకోవడానికే ఊరు వదిలి పెట్టాను. ఒకరు చెప్పిన మాట ఒకరు చెప్పడం లేదు. కొందరేమో పరిహసిస్తున్నారు. మరికొందరు లేదంటున్నారు. అసలు దేవుడనే వాడు ఉన్నాడా? ఉంటే ఎక్కడ ఉంటాడు?'' అని అడిగాడు సత్తెయ్య.

సాధువు మందహాసం చేస్తూ, ''చాలా పెద్ద ప్రశ్నే అడిగావు. దానికి సమాధానం తెలుసుకునే ప్రయత్నంలోనే నేనిలా తయారయ్యాను. అది అనంత అన్వేషణ. ఇక అభిప్రాయాలా? వారివారి అనుభవాలనుబట్టి ఉంటాయి. రేపోమాపో రాలిపోయే పండుటాకును చెబుతున్నాను. నామటుకు దేవుడంటే ఎక్కడో ఉండడు. అణువణువునా ఉంటాడు. ఎదుటివారి మంచిని కోరుకునే ప్రతివ్యక్తి హృదయంలోనూ నిండుగా కొలువుంటాడు. ప్రాణాపదలో నన్ను నువ్వు కాపాడావు. నువ్వు నా పాలిటి దేవుడివే. ఎదుటి వ్యక్తిలోని మంచిని చూడగల ప్రతి ఒక్కరూ దేవుణ్ణి సందర్శించే వారే. అందులో ఎలాంటి సందేహమూ లేదు,'' అన్నాడు.

సత్తెయ్య సాధువుకు నమస్కరించి, ఇన్నాళ్ళకు తన ప్రశ్నకు సమాధానం లభించినందుకు సంతోషిస్తూ తృప్తిగా తిరుగుముఖం పట్టాడు.

-కట్నేని వేంకట కృష్ణారావు





# కాపలా భటుడు



విజయగిరి సంస్థానాధిపతి రంగభూపతి, మంత్రి చంద్రవర్మ తరచూ మారువేషాల్లో దేశ సంచారం చేసి ప్రజల బాగోగులను తెలుసు కునేవారు. రాజు రాలేనప్పుడు చంద్రవర్మ మాత్రం ఒంటరిగా వెళ్ళేవాడు.

అలా ఆయన ఒకనాడు గాజుల మలారం భుజాన వేసుకుని గాజులమ్మేవాడిలా నగరం శివార్లలో తిరుగుతున్నాడు. పొద్దుపోవడంతో ఒక పూటకూళ్ళ అవ్వ ఇంట్లో దిగి, భోజనా నికి కూర్చున్నాడు.

ఆ సమయంలో ముగ్గురు యువకులు అక్కడికి వచ్చారు. తాము సుదూర గ్రామం నుంచి ఉద్యోగం వెతుక్కుంటూ రాజధానికి వెళుతున్నట్టూ, రాత్రికి అక్కడే భోజనం చేసి విశ్రాంతి తీసుకుని తెల్లవారగానే బయలు దేరుతామనీ చెప్పారు.

''కాళ్ళు చేతులు కడుక్కుని రండి, అన్నాలు వడ్డిస్తాను,'' అన్నది అవ్వ.

''ఆ సింగినాదం. దారిలోనే కడుక్కుని వచ్చాం. మొదట వడ్డించు,'' అంటూ ఇద్దరు గబగబా వచ్చి చంద్రవర్మ పక్కన హడావుడిగా కూర్చున్నారు.

మూడో యువకుడు మాత్రం, ''అవ్వా, దారి ఎటు?'' అని అడిగి పెరట్లోకి వెళ్ళి, శుభ్రంగా కాళ్ళూ చేతులు కడుక్కుని, తన సంచీలో నుంచి తువ్వాలు తీసి తుడుచు కుని, తువ్వాలును భుజంపై వేసుకుని వచ్చి పీటమీద పొందికగా కూర్చున్నాడు.

మంత్రి అతణ్ణే గమనించసాగాడు. మాటల సందర్భంలో అతని పేరు బలరాముడని తెలి సింది. మరిద్దరి పేర్లు భూషణం, నాగరాజు.

ఇద్దరు మిత్రులు ఏదో గొణుక్కుంటూ గబగబా తినేశారు. బలరాముడు మాత్రం, ''అవ్వా, కాకరకాయ వేపుడు చాలా బావుంది. చేదు లేకుండా ఎర్రగా కరకరలాడుతున్నాయి. మిరియాల చారు అద్భుతం. పెరుగు కమ్మగా



ఉంది,'' అంటూ ప్రతి ఆహారపదార్థాన్నీ మెచ్చుకుంటూ తినసాగాడు.

భోజనాలయ్యాక అవ్వ అందరికీ ఇంట్లోనే చాపలు వేసింది. ఇద్దరు మిత్రులూ ఆవులిస్తూ, ''బాగా అలిసిపోయాం, నిద్రముంచుకొస్తోంది,'' అంటూ పడుకుని క్షణాల్లో గురక పెట్టసాగారు.

బలరాముడు మాత్రం, 'నేను బయట అరుగుమీద పడుకుంటానవ్వా. నీ ఇంటికి కాపలాగానూ ఉంటుంది. నాకూ ఈ ఊరి గురించి తెలుసుకునే అవకాశమూ లభిస్తుంది,'' అంటూ చాప, దిండు తీసుకుని బయటకు వెళ్ళాడు.

చంద్రవర్మ గాజుల మలారాన్ని తలవద్ద పెట్టుకుని పడుకుని అలాగే నిద్రకు ఉపక్రమించాడు. అర్ధరాత్రి సమయంలో వీధిలో గొడవ జరుగుతున్నట్టు గ్రహించి తలుపు తెరుచుని వెలుపలికి వచ్చి చూశాడు.

బలరాముడు ఒక ముసుగు మనిషి చొక్కాను పట్టుకుని గుంజుతూ, ''నీ బాబు సొమ్మనుకున్నావురా?'' అని నిలదీస్తున్నాడు.

''నీది కాదు కదా? నీకెందుకదంతా? వదులు,'' అంటున్నాడు ముసుగువ్యక్తి.

మంత్రి వెళ్ళి విషయం అడిగాడు.

''ఇతడు చెప్పులు దొంగిలిస్తున్నాడండీ. నేను పట్టుకున్నాను. చూడబోతే అవి విలువయినవిగా ఉన్నాయి. బహుశా అవి మీవేఅయి ఉంటాయి. వాటిని కొనడానికి మీరెంత కష్టపడి ఉంటారు! ఈ దొంగ దాన్ని సునాయాసంగా అపహరించాలనుకుంటున్నాడు. సమయానికి నేను చూసి పట్టుకున్నాను,'' అన్నాడు బలరాముడు.

‘‘అతనన్నట్టు చెప్పులు నీవి కావు. నీకెం దుకా శ్రద్ధ? అవి విలువైనవయితే మాత్రం నీకేం? నా చెప్పులకు కాపలాకాయమని నేను నీకు చెప్పలేదు కదా?’’ అన్నాడు చంద్రవర్మ.

‘‘భలేవారండి.. మీరు. నేను బయటపడుకున్నాను. మీరు పెద్దవారు. అలిసిపోయి నిద్రపోతూండవచ్చు. మీరు చెప్పకపోతే మాత్రం మీ వస్తువులను కాపాడే బాధ్యత సాటి మనిషిగా నాకు లేదా? అదీగాక ఇలాంటి దొంగలను చూసీ వదిలిపెడితే దొంగతనాన్ని ప్రోత్సహించినట్టవుతుంది. అదీ ఒక విధంగా నేరమే. ఈ రాజ్య పౌరుడిగా దొంగతనాన్ని ఎదిరించడం నా కర్తవ్యం,’’ అన్నాడు బలరాముడు దొంగను వదలకుండా. అంతలో అక్కడికి వచ్చిన భూషణం, నాగరాజు దొంగ పెడరెక్కలు విరిచి కట్టారు.

చంద్రవర్మ బలరాముణ్ణి మనసులో మెచ్చుకుంటూ, ‘‘ఈ దొంగను ఏం చేయబోతున్నావు?’’ అని అడిగాడు.

‘‘కాపలా భటులకు అప్పగిస్తాను. రాజుగారు వాడికి శిక్ష విధిస్తారు. నిరుద్యోగులైన యువకులకు తగిన ఉపాధి కల్పిస్తే ఇలాంటి నేరాలకు పాల్పడరు. అధికారంలో ఉన్నవారు ఆ సంగతి గ్రహిస్తే మంచిది,’’ అన్నాడు బలరాముడు.

‘‘శభాష్,’’ అంటూ చంద్రవర్మ బలరాముణ్ణి మెచ్చుకున్నాడు.

తెల్లవారాక తను ఎవరయినదీ చెప్పి అతణ్ణీ, అతడి మిత్రులనూ వెంటబెట్టుకుని రాజాస్థానానికి వెళ్ళాడు.

బలరాముణ్ణి పరిశీలించి చూసిన చంద్రవర్మకు ఒక సమస్య పరిష్కారమయింది. కొంత కాలంగా రాజుగారి భవనానికి కొత్త ప్రధాన కాపలాభటుణ్ణి నియమించాలనుకుంటున్నాడు. సరైన భటుణ్ణి ఎలా ఎంపిక చేయడమా అని ఆలోచిస్తూన్న ఆయనకు బలరాముడి నిజాయితీ, బాధ్యతాయుతమైన ప్రవర్తనా ఎంతగానో ఆకట్టుకున్నాయి. బలరాముడికి తగిన శిక్షణ ఇచ్చి ప్రధాన కాపలా భటుడిగా నియమించాడు. తక్కిన ఇద్దరిని అతని అనుయాయులుగా చేర్చుకున్నాడు. -కోలపల్లి ఈశ్వర్





# దృశ్యం-భావం

సత్యప్రకాశానందస్వాముల ప్రవచనం విని గుట్ట మార్గం గుండా తిరిగివస్తున్న శ్రీధరుడు, భాస్కరుడు ఓ దృశ్యం చూసి అవాక్కయ్యారు. నోటి రంగు మాయని పావురం పిల్లకు ఒక గద్ద ఆహారం అందిస్తున్నది! దాన్ని చూడగానే భాస్కరుడి మనసు ఉద్వేగంతో ఉప్పొంగిపోయింది. అడుగు ముందుకు వేయలేక అలాగే ఉండిపోయాడు. శ్రీధరుడు మాత్రం ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా మరింత వేగంగా ఇంటిదారి పట్టాడు.

భాస్కరుడు, ''ఆహా, స్వాములవారి మాటలు అక్షరసత్యాలు కదా? రాతి లోని కప్పకు, పండు లోని పురుగుకు ఆహారం అందించేది దయాసింధువు అయిన ఆ దేవుడే! గద్ద తన ఆహారమైన పావురం పిల్లకే ఆహారం తినిపిస్తున్నదంటే అంతకు మించిన భగవద్విలాసం ఏముంటుంది? అంత చేసే కరుణామయుడు నా చిన్ని పొట్టకు ఇంత చూపకపోతాడా?'' అని అనుకుంటూ దారిపక్కన శిథిలమైపోయిన మార్గబంధేశ్వర ఆలయం వద్ద కూర్చుండిపోయాడు. సాయంకాలం వరకు ఒక్కరూ అటుమైపు రాలేదు. దాంతో ఆకలి దప్పులతో బాధపడడం తప్ప భాస్కరుడికి ఒరిగిందేమీ లేదు. దేవుడి మీద చెప్పలేని కోపం కూడా వచ్చింది!

చీకటి పడుతూండగా తనను వెతుక్కుంటూ వచ్చిన శ్రీధరుడికి తన అనుభవం ఏకరువు పెట్టి, ''దేవుడెందుకు ఇలా చేశాడు?'' అన్నాడు భాస్కరుడు విచారంగా.

''దేవుడేం చేస్తాడు నువ్విక్కడ బండరాయిలా కూర్చుండిపోతే? పావురంపిల్లకు ఆహారం అందించిన గద్దను చూసి ఆశ్చర్యపోయావు. ఆనందించావు. బావుంది. అంతటితో ఊరుకోకుండా నిన్ను నువ్వు పావురంపిల్ల స్థానంలో ఊహించుకుని గద్ద సాయం కోసం ఎదురు చూడడం వివేకం అవుతుందా? గద్ద శక్తిలేని పావురంపిల్లకు ఆహారం అందించినట్టు నిస్సహాయులకు సాయపడడం కదా శక్తియుక్తులు గల మనుషుల కర్తవ్యం? అదే కదా ఆ దృశ్య భావం! కాళ్ళు చేతులున్నాయి. తెలివితేటలున్నాయి. కష్టపడి పనిచేసి తోటివారికి సాయపడితే దేవుడు సంతోషిస్తాడు. ఎందుకైనా ఇంగిత జ్ఞానం ఉండాలి మిత్రమా!'' అంటూ శ్రీధరుడు అతణ్ణి వెంటబెట్టుకుని గ్రామంకేసి బయలుదేరాడు. -మంజుభారతి





# సంజాయిషీ




గోపి గణితం క్లాస్‌టెస్ట్‌లో ఇరవయ్యోవాడిగా వచ్చాడు. ఇంతకూ అతడికి లెక్కలు బాగా వచ్చు. క్లాసులో ఫస్టొచ్చిన రామం కూడా అర్థం కాని లెక్కల్ని గోపిచేత చెప్పించుకుంటాడు.

"నీకు శ్రద్ధ తక్కువ. ఏకాగ్రత లేదు. అందు కని చిన్నచిన్న తప్పులు చేసి మార్కులు పోగొట్టు కుంటున్నావు," అని తండ్రి అతణ్ణి సెలవు రోజుల్లో లెక్కలు సాధన చేయమనేవాడు. కానీ ఆదివారం వస్తే చాలు. గోపి ఆటలంటూ ఎవరె వరిళ్ళకో తిరుగుతాడు. ఒకరోజున, "పొద్దున్న వెడితే రాత్రికి తిరిగొస్తున్నావు. ఇంటిపట్టునే ఉండి ఆడుకుంటే మధ్యమధ్య కాసేపు లెక్కలు సాధన చేయొచ్చు కదా?" అని తండ్రి మంద లిస్తే, "నా ఫ్రెండ్సందరికీ వీడియోగేమ్సు న్నాయి. నాకవి కొని పెడితే నేను ఇంటిపట్టునే ఉంటాను," అన్నాడు గోపి.

"ఒక్కసారి లెక్కల్లో క్లాసు ఫస్టు రా. వీడియో గేమ్సు కొనిపెడతాను," అన్నాడు తండ్రి.

గోపి సరేనన్నాడు. శ్రద్ధగా చదివితే లెక్కల్లో క్లాసు ఫస్టు రాగలనని అతడికి తెలుసు. కానీ ఆ తర్వాత వచ్చిన క్లాసు టెస్టుకి సరిగ్గా ముందు రోజే వాళ్ళింటికి బంధువులొచ్చారు. గోపి సమ యమంతా వాళ్ళతోనే గడిచిపోయింది. అందు వల్ల టెస్టులో పన్నెండోవాడుగా వచ్చాడు.

మళ్ళీ టెస్టు ముందురోజు బంధువుల ఇంట్లో పెళ్ళి. ఇంకోసారి గోపికే జ్వరమొచ్చింది. ఇలా ప్రతిసారీ ఏదో అవాంతరం వచ్చి-లెక్కల్లో అతడి ర్యాంకు ఐదుకు మించడం లేదు.

"నా తప్పేంలేదు. దురదృష్టం నన్ను వెంటా డుతోంది. త్వరగా వీడియోగేమ్సు కొనివ్వండి," అని గోపి తండ్రిని వేడుకున్నాడు.

"నీ సంజాయిషీలు సరైనవే కానీ, నిన్ను దురదృష్టం వెంటాడుతోందిగా-అది వదిలేదాకా వీడియో గేమ్సూ లేవు," అని తండ్రి అతడికి ఖచ్చితంగా చెప్పేశాడు.

ఆ తరవాత లెక్కల్లో టెస్ట్‌లో ఎప్పుడూ నూటికి నూరు తెచ్చుకునే రామం క్లాస్‌టెస్ట్ రాస్తుంటే- సగంలో పెన్ను రీఫిల్ అయిపోయింది. ఎవర్ని డిగినా లేదన్నారు. టీచరే తిట్టి తన పెన్నిచ్చేసరికి కొంత టైం వేస్టయింది. దాంతో ఆసారి అతడికి

నూటికి ఎనభై మార్కులే వస్తే -తొంభై వచ్చిన గోపి క్లాసు ఫస్టు వచ్చాడు. తండ్రి మెచ్చుకుని, ''అనుకున్నది సాధించావు. కానీ దురదృష్టం నిన్నింకా వెన్నాడుతోంది. నా దగ్గర ఇప్పుడు బొత్తిగా డబ్బు లేదు,'' అన్నాడు.

తండ్రి మాట నిలబెట్టుకోలేదని గోపి గును స్తూంటే, ''నాన్నకి డబ్బిబ్బంది ఉన్నమాట నిజం. నువ్వు ఫస్టు రాకపోతే సంజాయిషీ ఇస్తే నాన్న నమ్మలేదూ-అలాగే ఇప్పుడు నువ్వూ నాన్నను నమ్మాలి,'' అన్నది తల్లి.

'నేను సంజాయిషీ ఇస్తుంటే నాన్న కూడా ఇలాగే బాధపడ్డాడేమో. ఇకమీదట అనుకు న్నది సాధించడమే తప్ప సంజాయిషీ ఇవ్వను,'' అనుకున్నాడతడు. ఐతే ఆ సాయంత్రం రామం వాళ్ళింటికొచ్చి అతడికి తన వీడియోగేమ్సు తెచ్చిచ్చి, ''మా నాన్న నాకివి క్లాసు ఫస్టొచ్చానని కొన్నాడు. ఆ తర్వాత క్లాసులో ఎవరు ఫస్టొస్తే వాళ్ళకివ్వాలని షరతు కూడా పెట్టాడు. మళ్ళీ నేను ఫస్టొచ్చేదాకా ఇవి నీవే,'' అన్నాడు.

గోపి ఆశ్చర్యపడి, ''ఈ సారి ఫస్టు రాకపో వడం నీ తప్పు కాదు, దురదృష్టం. ఆ సంగతి నేను స్వయంగా వచ్చి మీ నాన్నకు చెబుతాను. ఈ గేమ్సు నీ దగ్గరే ఉంచుకో,'' అన్నాడు.

''వద్దు. అనుకున్నది సాధించాలే తప్ప, సాధించనందుకు సంజాయిషీలిచ్చేవాడికి-జీవితంలో ప్రథమ స్థానం దక్కడం అసాధ్య మంటాడు మా నాన్న. సంజాయిషీలు వినడం ఆయనకు నచ్చదు. చెప్పడం నాకూ నచ్చదు,'' అని వెళ్ళిపోయాడు రామం.

రామం ప్రతిసారీ లెక్కల్లో క్లాసుఫస్టు రావ డంలోని రహస్యం గోపికి అర్థమైంది. అతడు జరిగింది ఇంట్లో చెబితే - తండ్రి వెంటనే, ''రామం వ్యక్తిత్వం గొప్పది. నువ్వతడికి నా కానుకగా ఈ వీడియోగేమ్సు వెనక్కిచ్చెయ్యి. ఈ సాయంత్రం మనం షాపుకి వెళ్ళి వీడియో గేమ్సు కొనుక్కుందాం,'' అన్నాడు.

''మరి, నీ దగ్గర డబ్బులేదు కదా?'' అన్నాడు గోపి.

''ఎక్కడ సంజాయిషీ ఉండదో అక్కడే ఘనకార్యాలు సాధించబడతాయని తెలిశాక -సంజాయిషీ ఇవ్వడం నీకే కాదు, నాకూ తప్పే!'' అని నవ్వాడు గోపితండ్రి. -బాబి





# కల్యాణ వేడుక

రంగాచారి హస్తవాసిగల గొప్ప వైద్యుడు. వీలయినప్పుడల్లా రామాలయానికి వెళ్ళి భక్తులకు రామగాథను వీనులవిందుగా చదివి వినిపించేవాడు.

ఇలా ఉండగా ఒక సంవత్సరం రామనవమికి సీతారామ కల్యాణం జరపాలని గ్రామపెద్దలు నిర్ణయించారు. ఎవరికి తగ్గ బాధ్యతలు వాళ్ళు చేపట్టారు. రంగాచారి కల్యాణ వేడుక కోసం ఆత్రంగా ఎదురు చూడసాగాడు.

రామనవమిరానే వచ్చింది. రంగాచారి వేకువజామునే లేచి స్నానజపాదులు ముగించి బయలు దేరబోతూండగా ఆయన భార్య అలివేలు బావిదగ్గర కాలుజారి పడింది. రంగాచారి బాధపడుతూ ఆమెకు పరిచర్యలు చేస్తూండగా వీధి తలుపు తట్టిన చప్పుడయింది. రంగాచారి తిరిగి చూశాడు.

''అయ్యా, నిండుగర్భిణి అయిన నా బిడ్డ స్పృహ తప్పి పడిపోయింది. ఇరుగుపొరుగు అందరూ రాములవారి కల్యాణం తిలకించడానికి వెళ్ళిపోయారు. మీరే నా బిడ్డను కాపాడాలి,'' అంటూ ఒక మధ్యవయస్కుడు ఆయనకు చేతులెత్తి మొక్కాడు.

రంగాచారి మందుల సంచీతో వచ్చిన వ్యక్తి వెంట నడిచాడు. అపస్మారక స్థితిలో పడివున్న గర్భవతి నాడి పరీక్షించి ఏదో మందు తాగించి, తలకేదో తైలం పట్టించాడు. కొంతసేపటికి ఆమెకు స్పృహ రావడమేగాక, మంత్రసాని పరిచర్యతో పండంటి మగబిడ్డను ప్రసవించింది.

అప్పటికే కల్యాణ ఘడియలు పూర్తి కావడంతో, ''నాకు శ్రీరామ కల్యాణ వేడుక చూసే భాగ్యం లేకపోయింది కదా, నేనేం అపచారం చేశానో, క్షమించు దేవుడా!'' అనుకుంటూ రంగాచారి ఇంటికి తిరిగి వచ్చాడు. అలసటతో అలాగే నడుం వాల్చాడు.

''నా కల్యాణ వేడుక చూడలేక పోయావని ఎందుకలా విచారిస్తావు? రెండు ప్రాణాలను కాపాడిన నువ్వు చేసిన ఉపకారమే నిజమైన కల్యాణ వేడుక. లోక కల్యాణానికి నీలాంటి వారే కావాలి!'' అన్న శ్రీరాముడి మాటలు విని రంగాచారి ఉలిక్కిపడి లేచాడు. నిజమా, కలా అనుకుంటూ ఆయన సజలనయనాలతో చేతులు జోడించాడు.

–అరుపల్లి గోవిందరాజులు



# మీ గోల్ఫింగ్ నైపుణ్యాలను పెంపొందించే డిఎల్ఎఫ్ గోల్ఫ్ అకాడెమీ!



గోల్ఫ్ క్రీడను నేర్చుకోవాలనే ఆసక్తి గలవారికి హర్యానాలోని డిఎల్ఎఫ్ గోల్ఫ్ అకాడెమీ సాదరస్వాగతం పలుకుతుంది! ఆరేళ్ళ బాలబాలికల నుంచి పెద్ద పెద్ద సిఇఓల వరకు ఆడే గోల్ఫ్ ఆట మనదేశ ప్రజల మధ్య వేగంగా ప్రాచుర్యం పొందుతోంది. మన దేశంలోని తొలి ప్రొఫెషనల్ గోల్ఫ్ అకాడెమీలలో ముఖ్యమైనది 1999లో స్థాపించబడిన డిఎల్ఎఫ్ గోల్ఫ్ అకాడెమీ. గత పదేళ్ళుగా ఇది అన్ని వయసుల గోల్ఫర్స్‌ను ఆకర్షించి శిక్షణ ఇస్తున్నది.

''విభిన్నమైన ఆశలతో, ఆశయాలతో ఈ క్రీడను నేర్చుకోవడానికి గోల్ఫర్స్ అకాడెమీలో చేరుతూ ఉంటారు,'' అంటారు డిఎల్ఎఫ్ అకాడెమీ డైరెక్టర్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్ కరణ్ బింద్ర. ప్రపంచంలోని ఇతర దేశాలలో లభిస్తూన్న విధంగా, ఉత్తమమైన గోల్ఫ్ ఆటను బోధించ వలసిన అవసరం ఉందని గుర్తించి, ఆ ప్రేరణ తోనే ఈ అకాడెమీ ఏర్పాటు చేయబడింది!

శిక్షణ పొందేవారు ప్రత్యేకంగా డిజైన్ చేయబడిన ఆస్ట్రోటర్ఫ్ మ్యాట్స్ మీదగాని, నేచురల్ టర్ఫ్ మీదకాని స్ట్రోక్స్ ప్రాక్టీస్ చేయడానికి ఎంపిక చేసుకోవడానికి ఇక్కడ అవకాశం ఉంది. ఎందుకంటేఈ అకాడెమీలో ఫ్లడ్‌లిట్ డ్యుయల్ లెవల్ డ్రైవింగ్ రేంజ్ ఉంది. ఇక్కడున్న మరి కొన్ని వసతి సౌకర్యాలలో ముఖ్యమైనవి:

- ఫోర్ టార్గెట్ గ్రీన్స్
- ఒక పిచ్చింగ్ ఏరియా
- ఒక లార్జ్‌సైజ్ పుటింగ్ గ్రీన్
- ప్రాక్టీస్ బంకర్‌తో ఒక చిప్పింగ్ గ్రీన్

క్రీడాకారులకు గోల్ఫ్ కోర్సులో ఎదురయ్యే ఎలాంటి రకం షాట్‌నైనా ప్రాక్టీస్ చేయడానికి వీలుగా అవకాశం కల్పించాలన్న ఉద్దేశంతోనే ఇవన్నీ డిజైన్ చేయబడి ఉన్నాయి. ఈ అకాడెమీ మరో ప్రత్యేక అంశం-ప్లేయర్స్ గోల్ఫ్ స్వింగ్‌ను వీడియో అనాలసిస్ చేయడం. సూపర్-స్లోమోషన్ కెమెరాలతో స్వింగ్ రికార్డు చేయబడి, ఆ తరవాత V1 ప్రొ సాఫ్ట్‌వేర్ లోడ్ చేయబడిన కంప్యూటర్స్‌తో అనలైజ్ చేయబడుతుంది. స్వింగింగ్ నైపుణ్యాన్ని పెంపొందించడానికి దోహదం చేసే ఈ అనలైజింగ్ టెక్నిక్,

ప్రపంచ వ్యాప్తంగా ఉన్న టాప్ గోల్ఫ్ అకాడెమీల శిక్షణా విధానాలకు అనుగుణంగా ఉంటోంది.

ఉపన్యాసాలకు వీడియో రూమ్, వీడియో గ్రంథాలయం, బాల్ కలెక్టింగ్ అండ్ డిస్పెన్సింగ్ మెషీన్, వరల్డ్ క్లాస్ సౌకర్యాలతో కఫే, ఉత్తమమైన కోచింగ్ అన్నీ ఒకే చోట ఉన్న డిఎల్ఎఫ్ గోల్ఫ్ అకాడెమీ మన దేశంలోని సుప్రసిద్ధమైన అకాడెమీలలో ముఖ్యమైనదిగా ఉండడంలో ఆశ్చర్యం లేదు.

'ఏషియన్ గోల్ఫ్' మాసపత్రిక రేటింగులో డిఎల్ఎఫ్ గోల్ఫ్ కోర్స్‌ను ఇండియాలోనే ఉత్తమమైనదిగా పేర్కొన్నది.

మన దేశంలో గోల్ఫ్ ఆడడం ప్రారంభమై గోల్ఫ్ క్రీడ బాగా వేళ్ళూనుతున్నది! భారత్‌లో చాలా ప్రాచుర్యం పొందిన క్రీడగా క్రికెట్ కొనసాగుతున్నప్పటికీ, గోల్ఫ్ పట్ల పలువురు యువతీ యువకులు ఆకర్షితులవుతున్నారు. తీవ్రమైన నిబద్ధతతో క్రీడా నైపుణ్యాన్ని పెంపొందించుకోవడానికి కృషి చేస్తున్నారు. అకాడెమీ భవిష్యత్తు కార్యక్రమాల గురించి వివరిస్తూ, ''అన్ని వయసుల గోల్ఫర్స్‌కూ విభిన్న సామర్థ్యాలు గలవారికీ గోల్ఫ్ క్రీడ ఆడడంలో గల ఆనందాన్ని అనుభవించడానికి నేర్పడం, ఛాంపియన్లను తయారు చేయడం, ముఖ్యమైన ప్రాథమ్యాలు,'' అంటారు కరణ్ బింద్రా. మరో టైగర్ వుడ్స్ లాగా, దిగ్విజయ్‌సింగ్ లాగా ప్రకాశించాలనుకుంటున్నారా? మీకు సంతృప్తికరమైన గోల్ఫ్ లెర్నింగ్ అనుభవాన్ని కలిగించడానికి డిఎల్ఎఫ్ గోల్ఫ్ అకాడెమీ సరైన వేదికను సమకూరుస్తుంది!

కరణ్ చెబుతున్నట్టు ''ఆనందించడానికి ఆడండి!''

వివరాలకు :


శ్రీ కరణ్ బింద్ర(డైరెక్టర్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్)
+91-9818112330


చిరునామా:


డిఎల్ఎఫ్ గోల్ఫ్ అకాడెమీ,
డిఎల్ఎఫ్ గోల్ఫ్ క్లబ్ అండ్ రిసార్ట్స్,
డిఎల్ఎఫ్ గోల్ఫ్ సిటీ, ఫేజ్ V
గుర్గాన్, హర్యానా - 122 002
టెలిఫోన్ నం. 0124-4525252
ఎక్స్‌టెన్షన్: 5245
ఇ-మెయిల్: karan@kbgolf.in




# తన్వి దొడ్డనవర్



తన్వి రోల్ మోడల్: ఒలింపియన్ మాస్టర్ స్విమ్మర్ మైఖేల్ ఫెల్ప్స్.

కామన్వెల్త్ గేమ్స్ బ్యాటన్ బెల్గామ్ గుండా వెళ్ళినప్పుడు దానిని తీసుకువెళ్ళే గౌరవం ఆమెకు లభించింది.

గెలుపొందిన అవార్డులు:

- ఇంద్ర ధనుష్య సన్మాన్ అవార్డ్ (2004, 2006).
- గణరాజ్య స్టేట్ అవార్డ్ (2005, 2006, 2007 మరియు 2008).
- రాజ్యోత్సవ్ అవార్డ్ (2006, 2007).
- భట్కండే స్పోర్ట్స్ అకాడెమీ బెస్ట్ స్పోర్ట్స్ పర్సన్ అవార్డ్ (2008).

బెల్గామ్‌కు చెందిన పదిహేడేళ్ళ ఛాంపియన్ స్విమ్మర్ తన్వి దొడ్డనవర్ తనకిష్టమైన ఈతను గురించి చాలా విషయాలు చెబుతుంది: ''మనలోని ఒత్తిడిని, అలజడిని తగ్గించి అనుదిన జీవితాన్ని ప్రశాంతంగా ఉల్లాసంగా, గడపడానికి ఈత చాలా ఉపయోగపడుతుంది. పరిగెత్తడం లాంటి వ్యాయామం చేసేప్పుడు త్వరగా అలిసిపోతాం. అయితే ఈత కొట్టేప్పుడు అంత తొందరగా అలిసిపోము. ఇంకా ఉత్సాహం పుట్టుకొస్తుంది!''

ఈమె రోజుకు ఐదు గంటలు ఈత అభ్యసిస్తుంది. వర్కవుట్ సెషన్ రోజుకు 5-6 కి.మీ. వరకు వెళుతుందన్నమాట. చేసే పనిలో నాణ్యత చాలా ముఖ్యం అంటుంది తన్వి. అందుకే తన అభిమాన క్రీడకూ, చదువుకూ మధ్య సమతౌల్యాన్ని పాటిస్తుంది. 'నేను ఒక గంటసేపు చదివినా 100 శాతం దానిమీదే దృష్టిని పెట్టి ఏకాగ్రచిత్తంతో చదువుతాను. అందువల్ల నేనెల్లప్పుడూ చదువుల్లో ముందు వరుసలోనే ఉంటాను,'' అంటుందామె.

బటర్‌ఫ్లై స్ట్రోక్ అంటే ఆమెకు చాలా ఇష్టం. బ్యాక్ స్ట్రోక్ వెనక్కు ఈదడం పట్ల మరీ ఆసక్తి చూపుతుంది. 50మీ. బ్యాక్ స్ట్రోక్ పెట్ ఈవెంట్‌లో ఆమె జాతీయ రికార్డు సృష్టించింది. ఆమె కెరీర్‌లోనే 2004వ సంవత్సరం నాసిక్‌లో జరిగిన నేషనల్ సబ్ జూనియర్ అక్వాటిక్ ఛాంపియన్‌షిప్ చాలెంజింగ్ ఈవెంట్‌గా నిలిచిందని చెబుతుందామె.

అంతర్జాతీయ క్రీడాపోటీల్లో భారతదేశం తరపున పాల్గొని ఘన విజయాలు సాధించాలన్నదే తన్వి ప్రగాఢ ఆకాంక్ష.



ఈనెల ఉదయతార తన్వికి చందమామ శుభాకాంక్షలు తెలియజేస్తోంది!

# గోల్ఫ్

ఆధునిక గోల్ఫ్‌ను పోలిన 'చుయి-వాన్' అనే ఆటను ప్రాచీన చైనాలో ఆడేవారు. 'చుయి' అంటే కొట్టడం; 'వాన్' అంటే చిన్న బంతి. చిన్న బంతిని కొట్టే ఈ ఆటను చైనా దేశస్థులు క్రీ.శ. 943లోనే ఆడేవారు. ఈ ఆటకు చిన్న బంతి, ఒక కర్ర, నేలపై తీసిన రంధ్రాలు కావలసి వచ్చేవి. రోమన్లు చర్మం బంతులను, వంపుగా ఉన్న కర్రను ఉపయోగించి 'పగానికా' అనే ఆటను ఆడేవారు. రోమనులే ఈ ఆటను ఇతర యూరోపియన్ దేశాలకు పరిచయం చేశారని చెబుతారు.

స్కాట్లాండులో రెండవ కింగ్ జేమ్స్ 1452లో గోల్ఫ్ క్రీడను నిషేధించాడు. ఎందుకో తెలుసా? ఈ క్రీడ పౌరుల యుద్ధ విద్యలకు ముఖ్యంగా విలువిద్య అభ్యాసానికి అంతరాయం కలిగి స్తోందని ఆయన భావించాడు! అయినా గోల్ఫ్ అభిమాని అయిన నాలగవ కింగ్ జేమ్స్ 1502లో ఆ నిషేధాన్ని తొల గించాడు. స్కాట్స్ రాణి మేరీ 1567లో గోల్ఫ్ ఆడేది. ఆమే ప్రప్రథమ ఉమన్ గోల్ఫర్ అయి వుండవచ్చని చెబుతారు. 18వ రోల్ గోల్ఫ్ కోర్స్ 1764లో ఆచరణలోకి వచ్చింది.

ఈ క్రీడ కళాత్మకమైన బుల్లి రూపం. మినీ గోల్ఫ్ 1867లో స్కాట్లండులో స్థాపించబడిన లేడీస్ పుటింగ్ క్లబ్, అతి ప్రాచీనమైన మినియేచర్ గోల్ఫ్ కోర్స్. అందులో 'హిమాలయాస్' అనే 18-హోల్ కోర్స్ ఉండేది. 20వ శతాబ్దారంభంలో జెమెట్రిక్ గోల్ఫ్ కోర్సస్ వచ్చాయి.

అపోలో 14 కమాండర్ అయిన అమెరికా వ్యోమగామి అలన్ షెపార్డ్ 1971లో చంద్రుడి మీద గోల్ఫ్ ఆడాడు.

రష్యన్ అంతరిక్షగామి మికైల్ త్యురిన్, ఇంటర్నేషనల్ స్పేస్ స్టేషన్ నుంచి(కెనడా గోల్డ్ మేనర్స్ ఎలిమెంట్ 21గోల్ఫ్ స్పాన్సర్ చేసింది) గోల్డ్ వైట్ బాల్‌ను కొట్టి 2006 నవంబర్ 23వ తేదీ చరిత్ర సృష్టించాడు.

అంతరిక్షంలో ఒకసారి కాదు; రెండు సార్లు ఆడబడిన ఏకైక క్రీడ గోల్ఫ్!



# చందమామ కబుర్లు



## మొట్టమొదటి ఎగిరే కారు

బోస్టన్ సమీపంలో ఉన్న టెర్రఫ్యూగియా ట్రాన్సిషన్ అనే ఒక అమెరికన్ కంపెనీ రెండు విధాలుగా ఉపయోగపడే 'ఫ్లైయింగ్ కార్' అనే వాహనాన్ని 2011వ సంవత్సరంలోగా విడుదల చేయనున్నది. రెండు సీట్లుగల ఈ వాహనంలో వెళ్ళేప్పుడు, రోడ్డుమీద వాహనాల రద్దీ ఎక్కువగా ఉందనుకుంటే, హాయిగా కారు రెక్కలు విచ్చుకుని పైకెగిరి వాటిని దాటుకుని ముందుకు వెళుతుంది. ఆ తరవాత రోడ్డు మీదికి దిగాలంటే హాయిగా దిగవచ్చు. ముప్పై సెకన్లలో రెక్కలు ముడుచుకుని కారులా రూపం మార్చుకుంటుంది.

ఈ 'ఫ్లైయింగ్ కార్' గాలిలో గంటకు 115 కి.మీ. వేగంతో 725 కి.మీ. దూరం వరకు వెళ్ళగలదు. గ్యాసోలిన్ ఇంధనంగా పనిచేసే ఈ వాహనం ముందుచక్రం రోడ్డు మీద నడవడానికీ, ప్రొపెల్లర్ ఎగరడానికీ ఉపయోగపడతాయి.

## ప్రపంచ రికార్డు సృష్టించిన కప్‌కేక్

అమెరికాలోని మిన్నీపాలిస్‌లో తయారు చేసిన 68.4 కి.గ్రా. బరువుగల కప్‌కేక్ ప్రపంచంలో కెల్లా అత్యంత పెద్దదైన కప్‌కేక్‌గా గుర్తించబడింది.

'మాల్ ఆఫ్ అమెరికా స్పాంజ్‌బాబ్ స్క్వార్ పాంట్స్' పదవ వార్షికోత్సవాల సందర్భంగా ఈ కేక్ తయారు చేయబడింది.



ఈ కేక్‌ను తయారు చేయడానికి మిన్నీసోటన్ పాస్ట్రీ చెఫ్ జోడీ లీనాప్స్ కేక్స్. కామ్‌కు సాయపడ్డాడు. 30.48 సెం.మీ ఎత్తు, 60.96 సెం.మీ. వెడల్పుగల ఈ కేక్‌ను బేక్ చేయడానికి 13 గంటల సమయం పట్టింది. నికెలోడియన్ నెట్‌వర్క్ కార్టూన్ క్యారక్టర్ స్పాంజ్ బాబ్ స్క్వారెల్ పాంట్స్ రూపంలో దీనిని అలంకరించారు.

ఈ కప్‌కేక్‌ను దాదాపు 1,500 మందికి పంచవచ్చునని ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసిన కార్యనిర్వాహకులు చెప్పారు.



# హాస్యకథ

## లీఫ్ ఆల్బమ్

లీఫ్ ఆల్బమ్ సబ్‌మిట్ చెయ్యాలని బాటనీ టీచర్ చెప్పడంతోనే అదంతా ఆరంభమయింది. ''అందరూ ఒకే రకమైన వేపాకులు, అశోకా ఆకులు అతికించుకుని రాకూడదు. విలక్షణ మైన ఆకుల కోసం చూడండి. ఉత్తమమైన లీఫ్ ఆల్బమ్‌కు ఇరవై మార్కులు. ఆ మార్కులు పొందిన వారు ఈ చాప్టర్ మీద జరిగే పరీక్షకు హాజరు కావలసినది లేదు. మినహాయింపు. గుర్తుంచుకోండి!'' అని మేడం చెప్పడంతో మా గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి.

పరీక్ష నుంచి తప్పించుకోవడమే కాదు. దాన్ని గురించి గొప్పగా చెప్పుకునే అపూర్వ అవకాశం కూడా ఉంది గనక, పట్టణంలో లభించే ఉత్తమ మైన ఆకులను సేకరించే పోటీ మా మధ్య ఆరంభమయింది. ఊటీ నుంచి తన తండ్రి తనకోసం తెప్పించిన అందమైన ఆర్నమెంటల్ లీవ్స్‌ను ఆకాష్ మాకు గొప్పగా చూపించాడు.



అతడి భూగోళ పాఠ్యపుస్తకంలో జాగ్రత్తగా దాచిన ఆకులను చూడ్డానికి మేము అతడి చుట్టూ చేరాం. ''ఇంత మంచి ఆకులు వేరెవ్వరూ తీసు కురాలేరు. కావాలంటే పందెం!'' అని ఆకాష్ సవాలు విసిరాడు. మాకు మాత్రం రోషం రాదా ఏంటి? నేనూ, సుశాంత్, మృదుల్ ప్రపంచం లోకెల్లా ఉత్తమమైన ఆకులను సేకరించాలని వెంటనే నిర్ణయించుకున్నాం.

బడి ముగియగానే సైకిళ్ళు తీసుకుని వోల్టాస్ కాలనీకేసి బయలుదేరాం. అక్కడే మాకు 'జూపి టర్ హౌస్' కనిపించింది. గోడలమీద బోగన్ విల్లా పువ్వులు కనిపించే అందమైన అతిపెద్ద భవనాలలో అదీ ఒకటి. అక్కడ అద్భుతమైన క్రోటన్ మొక్కలు ఉంటాయని కూడా మాకు గట్టి నమ్మకం కుదిరింది. ఉబ్బెత్తు కళ్ళతో, ఒక లావుపాటి స్త్రీ, గులాబీ పాదుల్లో కలుపు తీయడం గురించి తోటమాలికి ఆజ్ఞల్లాంటి సూచనలు జారీ చేస్తున్నది.

మేము నెమ్మదిగా లోపలికి అడుగుపెట్టాం. ఆమె మాకేసి కోపంగా చూసింది. ''ఆ మొక్కల నుంచి కొన్ని ఆకులు కావాలి. కోసుకోవడానికి అనుమతిస్తారా?'' అన్నాడు మృదుల్ పక్కనే ఉన్న అందమైన మొక్కలకేసి చూపుతూ. ''ఆ మొక్కల నుంచా?'' అని గద్దించి అడిగిందా స్త్రీ కోపంతో. మృదుల్ చేయిని అరవై డిగ్రీల కోణంలో పైకెత్తి, ''కాదు.. కాదు.. అవును.. ఆ మొక్కల నుంచే కావాలనుకున్నానను కోండి,'' అంటూ నీళ్ళు నమిలాడు. ఆమె



మళ్ళీ కొంతసేపు ఆ మొక్కలకేసి చూసి తల పంకిస్తూ, ''అక్కడున్న మొక్కల్లో దేని నుంచ యినా ఒక్క ఆకును ముట్టుకున్నారో.. అంతే...'' అంటూ హెచ్చరికను జారీ చేసింది. కాస్త దూరంలో ఉన్న అందమైన లేత ఎరుపు, నీలం రంగు పువ్వులను చూపుతూన్నప్పుడు ఆమె ముఖంలో గర్వం తొణికిసలాడింది. ''అది థాలస్ సోఫిస్టికేటస్ హైబ్రిడ్. ప్రత్యేకంగా ఆర్డరిచ్చి మరీ తెప్పించాను. అదిగో దానికి అవతల ఉందే అది ఫ్లు-మెట్టా ఎక్స్ట్రార్డినరీయా. మీరు అలాంటి మొక్కను మరెక్కడా చూడలేరు! అది సరే, మీరు ఏ స్కూలు నుంచి వస్తున్నారు?'' అని అడిగింది గంభీరంగా.

''సెయింట్ మార్గరెట్ మెట్రిక్యులేషన్ స్కూల్!'' అని చాలా గర్వంగా చెప్పాడు సుశాంత్.

ఆమె లోపలికి వెళ్ళగానే నా చూపులు ఆమె నిషిద్ధం విధించిన మొక్కల అందమైన ఆకుల మీదికి మళ్ళాయి. తోటమాలి మమ్మల్ని డేగలా చూస్తున్నాడు. నేను మృదుల్‌ను దగ్గరికి పిలిచి మాట్లాడాను. కొన్ని ఆకులలోని నల్లటి మరకలను తొలగించడంలో సుశాంత్ లీనమైపోయాడు. అతడు మరీ నిజాయితీపరుడు, మెతక స్వభావి గనక, నా పథకాన్ని ఒప్పుకోడు. అందువల్ల దీన్ని అతనికి చెప్పకూడదనుకున్నాను.

''ఆ మొక్కలకేమయింది?'' అని అడిగాడు సుశాంత్ వంకర్లు తిరిగిన ఆకులు గల మొక్కలకేసి చూపుతూ. తోటమాలి గడ్డం తడువుకుంటూ, ''మీరు చాలా తెలివైనవాళ్ళు గనకే, దానిని గుర్తించగలిగారు! ఈ రుతువులో బోలుపురుగు మొక్కలను వేధిస్తుంది. బోలుపురుగులంటే మీకు తెలియదనుకుంటాను. నేను చెబుతాను...!'' అంటూ ఆరంభించాడు.

తోటమాలి చెబుతున్న ప్రతి మాటనూ కళ్ళజోళ్ళను సరిచేసుకుంటూ ఆసక్తిగా వింటూన్న సుశాంత్‌ను చూస్తూంటే నాకు నవ్వాగలేదు. నోట్‌ప్యాడ్ ఉంటే సుబ్బరంగా నోట్స్ తీసుకునేట్టు కనిపించాడు. తన్నుకువస్తూన్న ఆవులింతలను అదుపుచేయడానికి మృదుల్ యమప్రయత్నం చేస్తున్నాడు. నేను మాత్రం ఆవిడ నిషేధించిన మొక్కల నుంచి కొన్ని ఆకులను వేగవేగంగా కోసేసుకున్నాను. వాటిలో చిల్లులున్న ఆకులంటే నాకెంతో ముచ్చటేసింది. నేను కొన్ని ఆకులే తుంచుకున్నాను. అయినా ఆ మొక్కలు బోసిగా కనిపిస్తున్నాయి. హఠాత్తుగా ఏదో శబ్దం వినడంతో పారిపోదామన్న ఆదుర్దాలో కుండీ మీద అడుగు వేసేశాను. కుండీతో పాటు మొక్క కూడా రెండుగా, విడిపోయింది. దిగ్భ్రాంతి చెందిన నేను దాన్ని ఒక్క క్షణం పరిశీలనగా చూడ్డానికి వంగబోయి మరో కుండీ మీద కూర్చున్నాను(పెద్ద పొరబాటు! అదే అదే థాలస్ సోఫి

స్టికేటెడ్ కుండీ!) వేగంగా లేచి చిదిగిపోయిన మొక్కను ఒకసారి తదేకంగా చూశాను. ఆ చోటి నుంచి వెంటనే తప్పించుకోవాలని నాకు తెలుసు. పరిగెత్తానుగాని, అంతలోనే మరికొన్ని కుండీలను పడదోశాను(పొరబాటుగానే అనుకోండి!).

పగిలిపోయిన కుండీల గురించి సుశాంత్‌కూ, మృదుల్‌కూ చెప్పగానే వాళ్ళు హడలిపోయారు.

సుశాంత్ నొసట చెమట బిందువులు పొట మరించాయి. నా చేతుల్లోని ఆకులను చూడగానే ఏదో అడగబోయాడు. అంతలోనే నేను, ''ఆవిడే నేను అడగడంతో కొన్ని ఆకులు కోసుకోమని చెప్పింది,'' అని హాయిగా అబద్ధం చెప్పేశాను.

మొక్కల గురించి మరిచిపోయి, మా ఆల్బమ్స్ తయారు చేయాలనుకున్నాం. ఆ రోజు సాయం కాలం జూపిటర్ హౌస్ గుండా వెళుతూన్నప్పుడు ఎవరికంటా పడకుండా తలవంచుకుని వంగి మెల్లగా జారుకున్నాను. అప్పుడా ఇంటి యజ మానురాలు పొరుగింటి వారితో, ''ముగ్గురు కుర్రాళ్ళు! ఆకుల దొంగల ముఠా! అమూల్య మైన నా తోటను నాశనం చేసేశారు. వాళ్ళను గనక పట్టుకుంటే...'' అంటూ గట్టిగా చెప్పడం చెవినపడ్డాయి.

మరునాడు మేము మా ఆల్బమ్స్ సబ్‌మిట్ చేశాం. మా బాటనీ టీచర్ మెచ్చుకుంటూ తలా డించడం చూసి పొంగిపోయాం. ''చాలా బావు న్నాయి. విలక్షణమైనవి. వీటిని ఎక్కడి నుంచి తెచ్చారు?'' అని అడిగిందామె. మేము వద్దని అడ్డుకునేలోగా సుశాంత్ లేచి అమిత వేగంతో ప్రకటించేశాడు: ''ఈ ఆకులన్నిటినీ వోల్టాస్ కాలనీలోని జూపిటర్ హౌస్ నుంచి సేకరించాం మేడమ్... ఆ ఇంటావిడ ఆకులు కోసుకోవడానికి అమర్‌కు అనుమతి ఇచ్చింది.''

బాటనీ టీచర్ ముఖంలోని నవ్వు తృటిలో మటుమాయమయింది. ఆమె నుదుటి మీద కోపం సూర్యుడిలా పుట్టుకొచ్చింది. మేడమ్ జూపిటర్ హౌస్ పొరుగునే ఉంటున్నదన్న వాస్త వాన్ని గ్రహించడానికి మాకెంతో సేపు పట్టలేదు. ఆ రోజు సాయంకాలమే మేము జూపిటర్ హౌస్‌కు వెళ్ళి, ఆ ఇంటావిడను చూశాం. నేను నాశపరచిన ప్రతి మొక్కకు బదులు మరో మొక్కను(కుండీలతో సహా) తెచ్చిపెట్టమంది.

అందువల్ల నేను ఫ్లు-మెట్టా ఎక్స్ట్రార్డినరీయా, లావేండ్రస్ ఎక్సోటికస్ మొదలైన మొక్కలను వెతుక్కుంటూ పట్టణంలోని ప్రతి 'నర్సరీ'కీ వెళ్ళ వలసివచ్చింది. అవి అరుదైన మొక్కలని ఆవిడ చెప్పడం అక్షరాలా నిజమని అప్పుడు గ్రహించాను. అలా తిరగడంవల్ల నాకెంతో లోకజ్ఞానం అబ్బిం దన్నదిమటుకు కాదనలేను. డబ్బు చెట్లకు కాయ దురా అంటూంటారు నాన్న. చూడబోతే కావల సిన ఆకులు కూడా చెట్లకు రావని ఈ జీవితాను భవం ద్వారా గ్రహించాను. -రమారమేష్





# నవ్వుల పువ్వులు



ఒక రెస్టారెంట్‌లో ఒక కస్టమర్ వెయిటర్‌కు తెగ పనిపెడుతున్నాడు. మొదట వాతావరణం వేడిగా ఉందని ఎయిర్ కండిషన్ ఆన్ చేయమన్నాడు. ఆ తరవాత మరీ చలిగా ఉందని ఆఫ్ చేయమన్నాడు. ఈ తతంగం చాలాసేపు జరిగింది. ఆశ్చర్యకరంగా వెయిటర్ చాలా ఓర్పును ప్రదర్శిస్తూ ఏమాత్రం చిరాకు పడకుండా చెప్పినట్టు చేస్తూవచ్చాడు. పక్క టేబుల్లో కూర్చున్న మరో కస్టమర్ దీన్ని గమనించి వెయిటర్‌ను పిలిచి, ''ఆయన ఇంతసతాయిస్తున్నా, నీకు చిరాకు కలగలేదెందుకు?'' అని అడిగాడు. ''ఓ... అదా నేను వీటినంతా అంతగా పట్టించుకోను సార్. అసలు ఇక్కడ ఎయిర్ కండిషన్ లేనేలేదు కదా?'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.



టీచర్: 1+1=2, 2+2=4 అయితే మరి 4+4 = ఎంత?

మైఖేల్: ఇది మరీ అన్యాయం. సులభమైన వాటికి మీరు సమాధానాలు చెప్పి, కష్టమైన దాన్ని నన్ను అడుగుతున్నారు?

శ్రుతి: ఈ రోజు లెక్కల పరీక్షలో మంజు ఒకే ఒక మార్కు తెచ్చుకుంది. దాన్ని ఐదుగా దిద్దిందని టీచర్ కనిపెట్టేసింది!

తాతయ్య: నువ్వు అలాంటి పని ఎప్పుడూ చెయ్యవనుకుంటాను. అవునా?

శ్రుతి: అవును. నిజమే తాతయ్యా. నేనైతే ఒకటిని ఏడుగా దిద్ది ఉండేదాన్ని.



## దత్తు










భయమెరుగని నలుగురు
పోగొట్టుకున్న బంగారు గొలుసు
చిత్రాలు: గాంధి అయ్యర్
అది ఆటవిడుపు సమయం. జాస్మిన్, మిథున్, అనిత, దీపక్ ఒకటిగా కూర్చున్నారు.
ఉమ ఎందుకో చాలా విచారంగా కనిపిస్తోంది.
మనం వెళ్ళి, ఏమయిందో అడుగుదాం.
ఏమయింది ఉమా?
నిన్న నా బంగారు గొలుసు పోగొట్టుకున్నాను. అన్ని చోట్లా వెతికి చూశాం.
నిన్న నువ్వెక్కడికయినా వెళ్ళావా?
అవును, మార్కెట్టుకు వెళ్ళాను. అయితే దాన్ని దారిలో ఎక్కడా పోగొట్టుకోలేదు.
నీ గదిని క్షుణ్ణంగా వెతికి చూశావా?
ఎంతో జాగ్రత్తగా వెతికాము. కానీ కనిపించనేలేదు.
మేము మీ ఇంటికి వచ్చి వెదకడంలో మీకు సాయపడతాం.
చాలా చాలా థ్యాంక్స్!


ఆ రోజు సాయంకాలం నలుగురూ కలిసి ఉమ ఇంటికి వెళ్ళారు. ఇల్లంతా మరోసారి క్షుణ్ణంగా వెతికారు. కానీ కనిపించలేదు.
దాన్ని బహుశా ఎవరో దొంగిలించి ఉంటారు ఉమా!
ఏమిటీ?
ఇంట్లో పనిచేసేవాళ్ళెవరైనా ఉన్నారా?
అవును ఉన్నారు. పనిమనిషి మంగమ్మ, తోటమాలి రామయ్య...
అవును, ఆమె మా ఇంట్లో మనిషి లాంటిది.
పిల్లలు మాట్లాడుకోవడం ఉమ తల్లి విన్నది.
మంగమ్మ అలాంటి పని చేసే మనిషి కాదు.
మరి దొంగిలించబడలేదంటే అది ఈపాటికి మనకు దొరికి ఉండాలి కదా.
అవును. సాధ్యాలన్నిటినీ పరిశీలించి చూడాలి కదా.

ఉమ తల్లి గదిలో నుంచి వెలుపలికి వెళ్ళిపోయింది.

ఒకవేళ దాన్ని మంగమ్మ దొంగిలించి ఉంటే, వెంటనే ఆమె దాన్ని అమ్మి ఉండాలి. అవునా?

దొంగ ఎవరైనప్పటికీ, వాళ్ళు దాన్ని ఈ పట్టణంలో అమ్మి ఉండలేరు.

ఎందుకు?

ఆ గొలుసును శాంతారాం నగల దుకాణం వాళ్ళే తయారు చేశారు. దాన్ని చూడగానే వాళ్ళు డిజైన్ను గుర్తించగలరు?

మ్‌మ్...

అవును. నిజమే. దొంగ అంత ప్రమాదానికి బరితెగించలేడు కదా!

మంచి ఆలోచన! ఇటీవల ఎవరైనా బంగారు గొలుసును అమ్మారా? అని అడుగుదాం.

నాకో ఆలోచన వచ్చింది.

దగ్గరున్న పట్టణంలోని దుకాణాలకు వెళ్ళి ఆరాతీద్దాం!


థ్యాంక్స్!
మనం చేయగలిగినది చేద్దాం!
ఇళ్ళల్లో నగల దుకాణాల వివరాలు సేకరించారు.
ఉన్నట్టుండి ఏమిటీ ఆసక్తి? ఎందుకొచ్చింది?
వాలాజా నగర్‌లో రెండు నగల దుకాణా లున్నాయి.
మిల్క్ బూత్ పక్కనే మరొకటి ఉంది..
అమ్మా... పక్క టౌన్‌లో ఏదైనా నగల దుకాణం ఉందా?
మరునాడు నలుగురూ ఒక చోట కలుసు కున్నారు.
కాబట్టి మనం మూడు దుకాణాలు చూడాలన్న మాట.
బడి అయ్యాక వెళదాం.
మిగిలి ఉన్న అవతలి ఒక్క షాపుకేసి సైకిళ్ళలో బయలుదేరారు.
సాయంకాలం వాళ్ళు పక్క టౌనుకు వెళ్ళారు. మొదటి రెండు దుకాణాలలో విచారించినా ప్రయోజనం లేకపోయింది.
అదొక్కటే మిగిలి ఉంది. మనం
(ఇంకా ఉంది)

CHANDAMAMA (Telugu) September 2009 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11








# బుబ్బా సాహసాలు




ఒకనాటి సాయంకాలం అనిల్ ఇంట్లో అనిల్, సురాజ్, స్మిత కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు.

నేను ఆయిల్ కలర్స్‌ను కలిపి ఐదు నిమిషాల్లో దాంతో అందమైన పెయింటింగ్ వేయగలను.

అదెలా సాధ్యమవుతుంది?

అనిల్ త్వరత్వరగా రంగులు కలిపాడు. మిశ్రమాన్ని కేన్వాస్ మీద చల్లి గందరగోళంగా ఏదో గీశాడు!

చూడండి పెయింటింగ్

ఆహా... హా... హా...

సరే, నేనిప్పుడు ఒకటి కూడా కింద పడకుండా పేకముక్కలను కలపగలను!

అది నేర్పరులైన కొందరికే సాధ్యమవుతుంది. నీ వల్ల అవుతుందనుకోను!

స్మిత పేకముక్కల్ని వేగంగా కలపడానికి ప్రయత్నించింది కానీ, అవి ఒక్కొక్కటిగా కింద పడిపోసాగాయి!

చూడండి!

ఆహా... హా... హా...

ఇప్పుడు సురాజ్ వంతు వచ్చింది. అతడి ముఖంలో చిరునవ్వు కనిపించింది.

నేను పళ్ళను కలపగలను!

పళ్ళనా? అదెలా కలుపుతావు? అసాధ్యం!

బుబ్బా ప్రత్యక్షమై, సురాజ్‌కు ఏదో అందించాడు.

సురాజ్ పిడికిలి తెరిచి బుబ్బాలూ చూపాడు.

బుబ్బాలూ!!!

కాదు! ఇది బుబ్బాలూ మ్యాంగో పీచ్. ఇది మామిడి-పీచ్ పళ్ళ కలయిక.

ఆ తరవాత...

బుబ్బాలూ జ్యూసీ మస్తీ!

